# కృతజ్ఞత

కోరిన వెంటనే ఈ నవలకు పరిచయ వాక్యాలు వ్రాసిన సుప్రసిద్ధ ఆధునికాంధ్ర నవలా చక్రవర్తి, కథకులూ, విమర్శకులూ అయిన శ్రీ టి. గోపీచంద్ గారికి చాలా కృతజ్ఞుణ్ణి.

— పి. వి. రత్నం.

# పరిచయం

— త్రిపురనేని గోపీచంద్.

పి. వి. రత్నంగారు నాకు చిరకాల మిత్రులు. వారు సాహితీ పరులే కాక ఆదర్శజీవులు. వారి రచనలన్నీ శాంతి కోసం, క్రాంతి కోసం చేసినవే. వారు ఏరచన చేసినా వొక పెద్ద ఆవేశానికి లోనై ముందుకు తోసుకు పోతున్నట్టు కనుపిస్తుంది. 'మానవ్వుడు తన ఆదర్శాన్ని సాధించటం ఇంత తేలిక అయితే ఎంత బావుండును' అని పిస్తుంది.

వారి స్వభావంలో వున్న ఆదర్శతత్వం, ఆవేశం, వారికి ఆదర్శసాధనలో వున్న కష్టనష్టాలనూ భీకర సమస్యలనూ కనపడనివ్వవు.

'పత్రిక పెడితే విజ్ఞానాన్ని వెదజల్లి ప్రజలను వివేకవంతులను చేయవచ్చు' అని అనిపిస్తుంది ఆయనకు.

ఆ ఆవేశంలో ఎడ్వర్టైజ్ మెంట్స్ లేకుండా పత్రిక నడవదనీ, ధనికులు సంఘంలో మార్పును కోరే పత్రికలకు ఎడ్వర్టైజ్ మెంట్స్ ఇవ్వరనీ వారికి అనిపించదు.

'కుటుంబ నియంత్రణా విధానం ఆచరణలో పెడితే కొంతవరకు దారిద్ర్యం నిర్మూలం అవుతుంది', అనిపిస్తుంది ఆయనకు.

ఆ ఆవేశంలో ఆ విధానం కలిగించే వసతులు గానీ, ఆవసతులను వాడుకునే సంస్కార విజ్ఞానాలు గానీ ఆగర్భ దరిద్రులకు లేవు అనిగాని వారికిఅనిపించదు.

'ధనం వెచ్చించి పాఠశాలలూ పారిశ్రామిక కేంద్రాలూ స్థాపిస్తే దేశం బాగుపడుతుంది', అనిపిస్తుంది ఆయనకు.

ఆ ఆవేశంలో మంచిని స్వార్థానికి వినియోగించుకునే మోసకారులూ, కుట్రదారులూ, విద్రోహులూ వుంటారని ఆయనకు అనిపించదు.

అలా అనిపించదు గనకే ఆయన ఈ సంఘంలో చెక్కు చెదరని ఆదర్శవాదిగా మనగలుగుతున్నారు.

అదే కాకుండా మరొక సంగతి కూడా మనం ఆలోచించవలసి వుంది. ఆదర్శసాధనలో వున్న కష్టాలను రచయిత వర్ణిస్తూ కూర్చుంటే అది స్వాభావిక రచనగా పేరు పొందితే పొందవచ్చుగాని చదువరులను కార్యోన్ముఖులనుగా చెయ్యగలుగుతుందా? చెయ్యలేదు. అందువల్ల పి. వి. రత్నం గారి వంటి ఆదర్శజీవులూ, వారు చేసే రచనల వంటి ఆదర్శ రచనలూ సంఘానికి చాలా అవసరం అని అనిపిస్తూ వుంటుంది.

పి. వి. రత్నంగారు కథలు వ్రాశారు. వ్యాసాలు వ్రాశారు. నవలలు వ్రాశారు. బహుముఖాల సాహిత్యసేవ చేస్తున్న వ్యక్తులు. వారేదివ్రాసినా ఉబుసుపోకకు వ్రాయరు. ప్రయోజనాత్మకంగావుంటై. ఏదో సాధించాలనే తహతహ వున్నవారు అవటంవల్ల వారి రచనల్లో వినోదం పాలు తక్కువగా వుంటుంది. అసలు ఉండనేఉండకపోయినా ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. సాహిత్యం రచయిత మనస్తత్వాన్ని అడుగడుక్కీ ప్రతిబింబిస్తూ ఉంటుంది.

ఇటీవల మానవసంఘం శరవేగంతో మారిపోతూవుంది. మన ఆచారవ్యవహారాలూ, సాంప్రదాయాలూ, అభిరుచులూ మనస్తత్వాలూ మనకండ్లముందే రోజుకొక కొత్తరూపంధరిస్తూ వున్నాయి. ఈమార్పులను వలసినంతగా మన సాహిత్యం ప్రతిబింబించటంలేదని నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూవుంటుంది.

మనం ఒకరకం దృష్టికీ, వొకరకం చిత్రీకరణకూ, వొకరకం సంఘటనలను ఏరుకోవటానికీ అలవాటుపడటం ఇందుకు ముఖ్యకారణం.

ఈ పరిస్థితిని అధిగమించిన రచయిత మిత్రులు పి. వి. రత్నంగారు. వారిరచనలో నేటిజీవితం పేజీపేజీకితొంగిచూస్తూ వుంటుంది. అందువల్ల కొత్తమనుష్యులు వారి గ్రంథాలలో మనకు కనపడటమేకాక, సుగంధద్రవ్యాలవ్యాపారం, పత్రికల ఎడిటోరియల్సూ, కనకదుర్గా కెమికల్ ప్రొడక్ట్సువంటి సంస్థలూ ప్రభుత్వం పాత్రలు ధరిస్తూవుంటై. మారుతున్న జీవితాన్ని ఎప్పటికప్పుడు సాహిత్యరంగంమీద ప్రదర్శించటానికి పడే కుతూహలం, ప్రయత్నం మెచ్చుకోదగ్గవి.

పి. వి. రత్నంగారు సాహిత్యోపాసకులు, సాధకులు. వారిని చూచినవారందరూ నా అభిప్రాయంతో ఏకీభవించ గలరు. ఈ సాధన వారిని ఒకచోట ఉండనీయదు. నిలిచి మాట్లాడనీయదు. ఆలస్యాన్ని వోర్వనీయదు. వొకమాటలో చెప్పాలంటే ఆయనను అనవరతం వెంటపడి తరుముతూ వుంటుంది.

ఈ సాధనవల్ల వారు భవిష్యత్తులో ఇంతకంటె ఉత్తమ గ్రంథాలు వ్రాయగలరనీ, సంఘంలోని సంఘటనలను వొరిపిడినీ, ఘర్షణనీ, జీవితపులోతులనూ మానవుల మానసిక విన్యాసాలనూ ఇంతకంటే ప్రగాఢంగా చిత్రించగలరనీ, తమ ఆవేశంలో చదవరుల మనస్సులను ఇంతకంటె ప్రబలంగా ఉత్తేజపరచగలరనీ విశ్వసిస్తున్నాను.

వారికి నా శుభాశీస్సులు.

# పయనమైంది ప్రజారథం

విజయ టెలిగ్రాం చదువుకొని వణికిపోయింది. కొన్ని క్షణాలు హృదయం ఆగిపోయినట్లనిపించింది. అంతలోనే దుఃఖం ముంచుకొచ్చింది.

ప్రక్కనే వున్న సరళ "ఊరికే దిగాలు పడిపోకు విజయా. నువ్వు వెంటనే బయలుదేరు" అంటూనే బట్టలు గబగబ సూటుకేసులో సర్దింది.

తండ్రి ఆరోగ్యం ఎట్లావుందో అన్న ఆందోళనలో అసలు ఆమె సరిగా ప్రయాణం చేయగలదో లేదో అని ఆమె తోటి హాస్టల్ విద్యార్థినులు సరళను వెంట వెళ్ళమని అన్నారు.

వాల్తేరు స్టేషన్‌కు వచ్చేసరికి అప్పుడే బండి ఒకటి వెళ్ళిపోయిందని తెల్సుకున్నారు. మరో నాల్గు గంటలకు కాని మరో రైలు లేదనేసరికి పిడుగు పడ్డట్లు అయింది.

సరళ టాక్సీ మాట్లాడింది. ఇద్దరూ దాంట్లో ఎక్కారు.

కలకలలాడే విజయ ముఖం వివర్ణమైపోయింది. శూన్యంలోకి చూస్తున్నట్టనిపించింది.

పది రోజుల క్రితం తండ్రి దగ్గరనుంచి క్షేమ సమాచారాలతో ఉత్తరం వచ్చిందికూడా. ఇంతలో ఈ ముప్పు రావడం ఆమెకు ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

తన తండ్రి పిసినిగొట్టు. నిజమే. చాలా మందికి అయిష్టుడు. అది కూడా వాస్తవమే. కొంపముంచి ఎవరైనా ......ఆమె ఇక ఆలోచించ లేక పోయింది.

నిజంగా సుస్తీ చేసిందేమో!

ఎన్ని లక్షలున్నా మనిషి ఆరోగ్యం దెబ్బతినకుండా చేసుకోవడం ఎవరి తరమూ కాదనిపించింది. తనని గారాబంగా పెంచిన నాన్న తనకు దూరమై పోతాడేమోనన్న భయాందోళన ఆమెను పీల్చి పిప్పి చేసింది.

"విజయా! నీ పెళ్ళి విషయం ఏదో చెకాబికీగా తేల్చివేయాలని ఈ ఎత్తువేయలేదుకదా ?" అంది సరళ.

"ఆయనకు అంత అబద్ధం ఆడవలసిన పనేముంది?" అంది నెమ్మదిగా విజయ.

దాంతో సరళ ఆ ప్రస్తావన ఆపుచేసింది.

ఒక వేళ అలాంటి గమ్మత్తు చేయాలనుకున్నా టెలిగ్రాం ఇప్పించి రెండు రూపాయలు ఖర్చుపెట్టే స్వభావం కాదే!

అయితే మరేమిటి?

కారు దూసుకుంటూ పోతున్నప్పటికి ఇంకా తన ఊరు రాలేదని విజయ ఆరాట పడసాగింది.

చెట్లూ, స్థంబాలూ, ఇళ్లూ, పశువులూ, బళ్లూ అన్నీ గిరగిర తిరిగి పోవడంకూడా ఆమె గమనించలేక పోయింది.

మధ్యలో ఇంజన్ వేడిఎక్కిపోవడం వల్ల ఒక సినీమా హాలు దగ్గరగా డ్రైవర్ కారు ఆపుచేశాడు. వాడు చక్కగా ఒక చిన్న హోటల్‌లోకి వెళ్ళి టిఫెన్ చేశాడు. టీ త్రాగాడు. క్లీనర్ ప్రక్కనున్న బోదెలోనుంచి బొక్కెనతో నీళ్ళు తెచ్చి ఇంజన్‌లో పోశాడు. బోనెట్ పైకిఎత్తాడు. ఆ తర్వాత వాడు కూడా టీ త్రాగి "కాఫీతీసుకుంటారా అండీ"? అని అడిగాడు.

సరళ ఎంత బ్రతిమాలినా విజయ కాఫీ వద్దంటే వద్దంది. సరళ కూడా కాఫీ తీసుకోనంది.

"ఊ, త్వరగా తేల్చండి" అని సరళ తొందర పెట్టింది.

కారు మళ్ళీ రాకెట్‌లా బయలుదేరింది. ఆ కారు కంటె విజయమనస్సు కొన్ని వందలరెట్లు వేగంగా ముందుకు పోతోందని సరళ గ్రహించింది.

రాత్రి 10 గంటల సమయం.

ఊరంతా నిశ్శబ్దంగా వుంది.

విజయ దారి చూపింది. కారు మేడముందు ఆగింది. కాంతి విహీనంగా వున్న ఆ వాతావరణం చూసి విజయ గుండెలు గుభేలు మన్నాయ్.

లోపలికి అడుగుపెడుతూనే "నాన్నగారికి ఎలావుంది?" అని ప్రశ్నించింద. ఆమెకు మరోవిధంగా ఏమి సమాధానం చెప్పినా ప్రాణాలు ఎగిరిపోతాయన్నట్లు వుంది.

చిన్నాన్న, మేనమామ ఇంకా అనేకమంది బంధువులు ఆమెను నెమ్మదిగా తండ్రివున్నగదిలోకి తీసుకొని వెళ్ళారు.

మిణుకుమిణుకు మంటున్న దీపంలా తండ్రి మంచం మీద పడివున్నాడు.

"నాన్నా..." అంది కన్నబిడ్డ పొంగుకొచ్చే దుఃఖం ఆపుకోలేక.

"నాన్నా..." ఆమె కంఠం రుద్ధమైపోయింది.

నాగయ్య నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

"వచ్చావా...తల్లీ..." అన్నట్లు చూశాడు.

అతని రొమ్ములపై విజయ తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చింది. బంధువులు ఆమెను ఓదార్చారు.

ఇంతలో చిన్నాన్న ఆయనకు మందు త్రాగించాడు. డాక్టర్ కోసం మళ్ళీ కబురు వెళ్లింది.

"అమ్మా..." అన్నాడు నాగయ్య.

"నాన్నా..."

ఆయన కొంచెం కదిలాడు. చుట్టూచూశాడు.

ఆయన ఏవోఏవో చెప్పాలని అనుకున్నాడు. కాని ఓపిక చచ్చిపోయింది.

ఆయాసపడుతూ ఆఖరిసారిగా అందరూ వింటుండగా ఇట్లా అన్నాడు:

"అమ్మా...నీ కోసమే కనిపెట్టుకొని వున్నాను... రెండు ముక్కలు చెబుదామని తల్లీ..."

మళ్ళీ ఆయాసపడ్డాడు.

అతని కళ్ళల్లో ప్రాణాలు వున్నాయనిపించింది. చుట్టూ కావలసిన వాళ్లు తమ గురించి కూడా ఏదో చెబుతాడని గుమిగూడి వున్నారు.

"ఈ డబ్బు...ఇన్ని లక్షలు నేను ఎందుకు కూడబెట్టానో నాకు తెలియదమ్మా...ఇంత డబ్బులో కూడా ఎర్రని ఏగాణీ నేను పట్టుకొని పోవడం లేదు. ఈ విషయం అనేకమంది అనేక గాథలుగా చెప్పినా అర్థం కాలేదు..."

మరణశయ్య మీద నున్న నాగయ్య నోటినుంచి వచ్చే ప్రతి మాట ఒక లక్ష రూపాయల విలువగా అక్కడున్న ప్రతి వ్యక్తి వినడం సరళ గ్రహించింది.

"ఇప్పుడవన్నీ ఎందుకు నాన్నా..." విజయ హృదయం తల్లడిల్లిపోతూ అంది.

"పిచ్చి తల్లీ ...నాకు జీవితం అర్థమైంది కాని సార్థకం చేసుకో లేదమ్మా. నీకు ఇప్పుడప్పుడే ప్రపంచం అంటే ఏమిటో తెలియదు. అయినా నీ బ్రతుకు నిరాఘాటంగా వెళ్ళిపోవడానికి నీకు ఎన్నో లక్షలు ఇచ్చి పోతున్నానుతల్లీ ... కాని నేను ఎన్నడూ కోరని కోరిక ఒకటి నువ్వు తీర్చాలమ్మా...నాన్న పేరు నిలబెట్టు. నా పేరు శాశ్వతంగా చరిత్రలో వుండి పోయేటట్లు చేయాలి. చేయగలవా తల్లీ ?"

వణికే చేతులతో తండ్రి ఆమె తలను నిమిరాడు.

"చెప్పమ్మా..."

"చేస్తాను నాన్నా"

ఆ కోరిక అర్థం ఏమిటో అప్పట్లో ఎవరూ చర్చించుకొనడానికి వీలులేకుండా డాక్టర్ వచ్చాడు.

ఆయన మళ్ళీ నాడి చూశాడు.

పరిస్థితి క్షణ క్షణం క్షీణించి పోవడంతో పెదవి విరిచాడు.

"ఎట్లావుంది డాక్టర్‌గారూ ?" అందరూ కళ్ళతోనే ప్రశ్నించారు.

వాళ్ళ తృప్తి కోసం మరో ఇంజక్షన్ ఇచ్చాడు. నాగయ్య తమ్ముణ్ణి ప్రక్కకు పిల్చాడు.

అంతే, అంతా గొల్లు మన్నారు.

విజయ భోరున ఏడ్చింది.

అర్ధరాత్రికూడా ఏడ్చింది.

## 2

తెల్లవారిందని శోక దేవతకు తెలియలేదు.

క్షణంలో గ్రామమంతా తెల్సిపోయింది'

అనేకమంది వచ్చి పరామర్శించి వెళ్ళారు. ఊర్లో ప్రజలు రకరకాలుగా చెప్పుకున్నారు.

అక్కడున్న వారం రోజుల్లో సరళ విన్న విషయం ఇది:

నాగయ్యకు 70 లక్షల రూపాయల ఆస్థి అయినా వుంది. పెద్దబ్బాయ్‌ని మొద్దబ్బాయ్ అని ఆయన అనేవాడు. కాని అది అబద్ధం.

బ్రిటిష్ సామ్రాజ్యాన్ని భారత దేశంలో తుది ముట్టించ డం కోసం ఆయన స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న వీరుడు. నిస్వార్థపరుడు. చివరకు సత్యాగ్రహాల్లో పాల్గొని, జైళ్ళల్లో మ్రగ్గిపోయి, పోలీసులు పెట్టిన హింసాకాండతో శరీరం కుళ్ళిపోయి మరణించిన అమరజీవి.

లోకం ఆ త్యాగమూర్తిని శ్లాఘించినా తన మాట వినలేదని నాగయ్య బాధ. అతని కుటుంబం కూడా నానా కష్టాలు పడుతున్నా, పెద్ద కోడలుకు చెందవలసిన ఆస్థి చెంద నివ్వలేదు.

పెద్దమ్మాయ్ భర్త చెడుతిరుగుళ్ళు తిరిగి భార్యను అనుమానంతో అవమానించి కుటుంబాన్ని నరకతుల్యంగా మార్చడంతో ఆ ఇల్లాలు తన గుడ్డలపై కిరసనాయిలు పోసుకొని, నిప్పంటించుకొని లోకానికి దూరమై పోయింది.

ఇక మిగిలింది గారాబు బిడ్డ విజయ. విజయకు ఆస్థి వుందని సంతోషమే తప్ప, చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతురాలు. కుటుంబం ఛిన్నాభిన్నమై సౌఖ్యం పటాపంచలై పోయినందుకు దుఃఖం దాచుకున్న శోకతరంగం.

చనిపోతూ చనిపోతూ నాగయ్య తన మాట కూడా ఏదో చెబుతాడని ఆశించిన బాంధువులకు నిరాశ కల్గించి వెళ్ళిపోయాడు.

మరో ప్రక్క బ్రతికినంతకాలం బక్కపల్చగా ఉండే నాగయ్య ఏనుగుల్లాంటి మనుషుల్ని అప్పులు పెట్టి, కోర్టులకు

ఈడ్చి పీనుగుల్ని చేసి వదలి వాళ్ళను ఏడ్పించిన పాపం, శాపమై ఆ కుటుంబాన్ని సర్వనాశనం చేసిందని అనేకమంది ప్రజలు సంతోషించడం మామూలు.

ముఖంఎదుట 'అయ్యోపాపం' అని అనడమేగాని అది హృదయాంతరాల్లోంచి వచ్చిన సానుభూతి కాదని సరళ గ్రహించింది.

గుప్పెడు మనిషి అయినా లక్షలాది ఆస్థి వుండడంవల్ల అంతమందీ ఆయన్ని ఏమీచేయలేకపోయి వుంటారని సరళ భావించింది.

విజయ అప్పుడప్పుడూ ఎందుకు ఇంత ముభావంగా బయటవుంటూ వుండేదో ఇప్పుడు సరళకు అర్థమైంది.

గుండెల్లో ఇంతక్షోభ, సంఘర్షణ పెట్టుకొని అట్లా యూనివర్శిటీ ప్రాంతంలో సామాన్య వ్యక్తిగా బ్రతకడం సరళకు చాలా ఆశ్చర్యం కల్గించింది.

అయినా తండ్రికి ఇచ్చిన వాగ్దానం విజయ ఎంత విద్యావంతురాలైనా ఇంతమంది శత్రువులమధ్య ఎట్లా ఎప్పటికి నెరవేర్చుతుందో అన్న ఆలోచన ఆమెను చాలా రోజులు నిద్రపోనివ్వలేదు.

## 3

సరళ వెళ్ళిపోయింది.

నెల రోజులు దొర్లిపోయాయ్.

అనేకమంది అనేకవిధాలుగా ఆమెకుటుంబానికి దార్పుకల్గించారు.

"వెళ్ళిపోయిన వారు తిగ్గి రారమ్మా !"

"ఏమిటో మన పిచ్చిగాని ఎవరు శాశ్వతం ?"

"అంతవరకే మనకు ఋణంవుంది. అది తీరిపోయింది"

ఇలాంటి మాటలు వినే కొలదీ ఆమెలో శోకం పొంగి పొర్లి పోయేది. గదిలో కిటికీ దగ్గర కూర్చొని వీధిలోకి పొలాలవైపు చూసేది.

మామూలు ప్రపంచమే.

ఎప్పటిలా ఎదురుగా మంచి నీళ్ళ చెరువు. దొడ్లో పాలేర్లు పాలు పితకడం, చెట్లు పూలు పూయడం అంతా యథా ప్రకారంగానే కన్పించింది.

విజయ క్రమక్రమంగా దుఃఖ సాగరం నుంచి బయటకు వచ్చింది.

మనశ్శాంతి కోసం మళ్ళీ విశ్వ విద్యాలయంలో చేరా లనుకుంది.

'ఎవరి కోసం ?' తనలో తాను ప్రశ్నించుకుంది.

'నీ కోసమే'

'ఎందుకు ?'

'నీ బతుకు కోసం'

'మనిషి బ్రతకడం ఎందుకు?'

ఇదేం ప్రశ్న, అయినా మనిషి ఎందుకు బ్రతుకు తున్నట్లు ?

'ఎందుకు ?'

ఆమెకు సమాధానం రా లేదు.

చదువు వుంటేనే పొట్ట నింపుకొనడం అవుతుందన్న విషయం ఆమెకు వర్తించదు.

కావలసినంత డబ్బు వుంది.

'ఈడబ్బు నాన్నను కాపాడ లేకపోయిందేం ?'

'అదేగా ఆయన్ని కూడా ఆశ్చర్యంలో ముంచింది.'

'సరే, బాగానే వుంది. మరి డబ్బు వ్యక్తి గౌరవాన్ని పెంచుతుందా ?'

'ఔను.'

'మరి నాన్నను ప్రజలు ద్వేషిస్తారేం ?'

'ఆయన పిసనారి. ప్రజాపీడకుడు.'

'అలాగని డబ్బును పంచిపెట్టాలా ? వీధుల్లో విరజిమ్మాలా? చేస్తామే అనుకో. లోకంలో శాంతి వస్తుందా? అందరూ - ఇన్ని కోట్లమందీ సుఖంగా వుంటారా ?'

ఇలాంటివి నిత్యం లక్ష ప్రశ్నలు ఆమెకు ఎదురై, ఉక్కిరి బిక్కిరి చేసి పారేయడంతో సరళకు ఉత్తరం వ్రాసింది.

మనశ్శాంతిలేని విజయ రాసిన వుత్తరమని ఆమె త్రోసి పారేయలేక పోయింది.

ఆ ఉత్తరానికి జవాబు వచ్చింది.

మరో ఉత్తరం. మరో ఉత్తరం.

నెలలు గడిచి పోయాయ్.

విజయ మామూలు మనిషి అయింది.

ఇప్పుడు నిదానంగా ఆలోచించుకొని సమాధానం చెప్పుకొన సాగింది. తన మనస్సులో వున్న చీకటిని తరిమి

కొట్టింది. అట్లాగే మేడను పట్టిన బూజును తుడిపించి, వెల్ల వేయించింది.

గుమ్మాలకు రంగులు వేయించింది. తెరలు కట్టించింది. సామాను చక్కగా సర్దించింది. ఖాతాపుస్తకాలు చూసుకుంది.

"ఇంకా 20 వేల రూపాయల బాకీలు ప్రజలనుంచి రావలసివున్నాయ్" అన్నాడు గుమస్తా.

అందర్నీ ఒక్కసారిగా రమ్మంది.

బిక్కుబిక్కుమంటూ వచ్చారు.

"మీరు బాకీలు ఇచ్చివేయండి" అంది.

"ఇవ్వలేంతల్లీ. ఇవ్వలేం. మాకొంపాగోడూతీసుకున్నా అంతవిలువ చేయని దరిద్రపరిస్థితుల్లో వున్నాం."

"ఈ రోజుల్లో వున్నవాళ్ళు లేనట్లుగా, లేనివాళ్ళు వున్నట్లుగా మాట్లాడడం నేర్చుకున్నారు. మీరు నమ్మవద్దు తల్లీ"అన్నాడు తల నెరిసిన గుమస్తా.

"సరే. మీరు డబ్బు ఇక ఇవ్వనవసరంలేదు."

"నిజమా ?"

"నిజమా తల్లీ ?"

అందరి ముఖాల్లో ఆనందం ! ఆశ్చర్యం ! !

"ఔను ముమ్మాటికీ ఇవ్వనవసరంలేదు." విజయ లోపలికి వెళ్ళిపోయింది.

గుమస్తాకు మతిపోయింది. విజయ చిన్నాన్న మేన

మామలు తారాజువ్వల్లా లేచారు. గుమస్తా వారిని సముదాయించాడు.

విజయ వెనుకనే వెళ్లి "మనం ఒక సత్రంకట్టిస్తే బాగుంటుంది తల్లీ" అన్నాడు.

"ఎందుకు?"

"వీళ్ళంతా ఇక హాయిగా అందులో విశ్రమించడానికి" అన్నాడు గుమస్తా.

విజయ మరొకరి మీద అయితే ఆ సమయంలో విపరీతంగా మండిపడేది. కాని తనని ఎత్తి ఆడించిన తాత, తన ఆస్థిని పెంచి దాచి పెట్టిన మామ.

"మీ మాటలు నాకు అర్థం కావడం లేదు." అంది విజయ దిండు గలేబి మీద రంగుల దారాలు కుడుతూ.

"మీకు తెలియదమ్మా. చిన్నతనం ఇంకా. నాన్నగారు ఇట్లాగే ముందు కాలువ ఒడ్డున సత్రం కట్టించారు. పాపం పేదవారికి నీడ వుంటుందని. ఇక చూడండి. అనేక మంది సోదరులు సోమరులుగా మారి అందులో హాయిగా పడుకొని, పగలు ఊరిమీద పడేవారు. అందుకే నాన్నగారు దాన్ని ధాన్యం గిడ్డంగిగా మార్చి అద్దెకు ఇచ్చివేయసాగారు..."

విజయకు ఏదో చెప్పాలని నాలుక చివరి వరకూ వచ్చింది. ఇంతలో అమ్మమ్మ పిలవడం వల్ల లోపలికి వెళ్ళిపోయింది.

గుమస్తా ఇంటి ముఖం పట్టాడు.

విజయ పేరు ఊరంతా మారు మ్రోగి పోయింది. నాగయ్య కడుపున పుట్టవలసిన పిల్ల కాదన్నారు. 'రత్నం లాంటి పిల్ల' అన్నారు. ఆ విధంగా నాగయ్య చరిత్ర పుటల్లోని మరకలు చెరిగిపోవడం ప్రారంభ మయ్యాయి.

# 4

ఈ తెగింపు విజయలో కన్పించే సరికి బంధువులంతా ఉలిక్కి పడ్డారు.

"ఈ ఆస్థి హారతి కర్పూరంలా అయిపోవడం ఖాయం తల్లీ" అన్నారు.

"నాకు తెల్సు" అంది.

చిన్నపిల్ల అయితే చెప్పవచ్చు. మూర్ఖురాలైతే అస హ్యించుకోవచ్చు. మరి అన్నీ తెల్సిన విజయకు ఎవరు చెబు తారు ? ఏం చెబుతారు ?

"పెళ్ళి చేసివేస్తే రోగం కుదురుతుంది" అన్నారు ఒకరు.

"నిజమే" అన్నారు మరికొందరు.

పెద్ద పెద్ద సంబంధాలు వెదికారు. గొప్ప గొప్ప పెళ్ళికొడుకుల ఫోటోలు చూపించారు.

"నేను చేసుకోను"

మేనమామ చెప్పి చూశాడు. పిన్ని చెప్పింది. అమ్మమ్మ బ్రతిమాలింది. కుర్చీలోంచి లేచి మరోగదిలోకి వెళ్ళి పోయింది విజయ.

"ఎవరి జీవితాల్లో ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు?" అన్నాడు చిన్నాన్న.

అత్తయ్య చెప్పి పోషించింది.

అయినా ఒకరి మాటలు వినే రోజులు వెళ్ళి పోయాయ్ అనుకుందా విజయ. ఆమెఅందరితో ఇదివరకటిలామాట్లాడడం మానివేసింది. దాంతో 'భూమిమీద నిలవడంలేదు' అనుకున్నారు కొందరు.

కాని అసలు అమ్మా, అన్నయ్యా, అక్కయ్యా పోవడంతో తూట్లుపడిపోయినహృదయం, తండ్రి దూరమవడంతో అది కాస్తా కుళ్లిపోతోందనిపించింది.

దానికి తగిన మందు మౌనం. మౌనంలో విశ్రాంతి వుంది. ఉత్సాహంవుంది. అదీ ఆమె తెల్సుకున్నవిషయం.

పల్లెటూరులో పడుచుపిల్ల - అందులో గొప్పింటిబిడ్డ - పొలంవెళ్ళడం విడ్డూరాల్లో విడ్డూరం.

చల్లగాలికోసం మొదటిసారి పాలేరుతో ఆమె బయలుదేరగానే ఇంట్లో విప్లవం బయలుదేరింది.

"నా నాన్న సంపాదించిన పొలం నేను చూసుకొనడానికి హక్కులేదా ? లేదంటారా చెప్పండి ?"

ఈ తిరుగుబాటు అర్థంకాలేదు.

'ఇలాగైతే నీకు పెళ్ళికాదు' అంది అత్తయ్య.

విజయ బయలుదేరింది.

ఊరుచివర దరిద్రదేవత తాండవిస్తున్న మాలపల్లె చూసి ఆమెమనస్సు వికలమైపోయింది.

విజయ వెళ్తుంటే అందరూ- ఆడా మొగా- దండాలు పెట్టారు.

మోకాలు బురదలో, దోమలమధ్య, పెంటకుప్పల మధ్య, ఇరుకుగా, మురికిగావున్న పాకలలో కంపుకొడుతున్న ఆ మనుషుల్ని చూసి విజయ హృదయం తల్లడిల్లి పోయింది.

"ఎట్లా వుంటున్నారిక్కడ ?"

ఏ 'ప్రభుత్వమూ' ఆలోచించని సంగతి!

ఏ 'ప్రజానాయకుడూ' పట్టించుకోని ప్రశ్న !!

"ఏం చేస్తాం తల్లీ ?"

ఆమె ముందుకు సాగింది.

"ఇదే మన కొబ్బరి తోటమ్మగోరూ" పాలేరు అణకువగా దారి తీస్తూ చెప్పాడు.

అయిదెకరాలతోట. ప్రశాంతమైన గాలి. చక్కటి వాతావరణం!! 'తను ఇక్కడ ఒక చిన్న డాబా కట్టుకొని వుంటే ?' అని ప్రశ్నించుకుంది.

'ఉన్నది చాలదా?' అని సమాధానం. కొన్ని క్షణాలు ఆ చెట్ల క్రింద కూర్చుంది. ప్రక్కనున్న పెద్దపాలేరు 'కొబ్బరి బొండాలు నాల్గు తీయరా !' అని గబగబా బండెత్తు విప్పి, దగ్గరగా వచ్చి అన్నాడు.

"తీసొచ్చులే. నువ్వు వెళ్ళి ఆ మాలగూడెం పెద్దల్ని పిల్చుకొనిరా" అంది విజయ.

బుజ్జోడు పరిగెత్తాడు. వాళ్ళు ఆగరా బాదరా అప్పులు

తీర్చమంటుందేమో నన్న భయంతో రొప్పుకుంటూ వచ్చి ఆమె ముందు చేతులు కట్టుకొని నిలబడ్డారు.

"అదిగో ఆ దొంగ నాయాలే, మొన్న మన గడ్డి కోసుకు పోయాడండీ" అన్నాడు పెద్ద పాలేరు తలపాగ సరిగా చుట్టుకుంటూ.

"నువ్వుండు. ఇక్కడే మీరు ఇళ్ళు కట్టుకోండి"

"ఏమిటి తల్లీ ?" ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ ఆ దేవత మాటలు అర్థం కాక అడిగారు.

విజయ మళ్ళీ చెప్పింది.

కలకాదుగదా ! కాదు, పరమ సత్యం.

"మరి పేదోళ్ళకు డబ్బేది తల్లీ ?"

లోగడ ఇళ్ళ స్థలాలకు బంజరు భూములు ఇవ్వమని అయిదు సంవత్సరాల క్రితం పెట్టుకున్న అర్జీని ప్రభుత్వం ఇంకా పరిశీలిస్తూనే వుంది. అది అప్పుడే వస్తుందా చస్తుందా అని ఈ పేద గుండెల ధీమా.

కాని ఈ సంఘటన, ఈ సంతర్పణ ఇంత త్వరగా ఇలా జరుగుతుందని పాపం వాళ్ళకు తెలియదు.

"నేనే కట్టించి ఇస్తాను"

అస్థి పంజరాలు సాష్టాంగ నమస్కారాలు చేశాయ్. "మీ రుణం జనమ జనమాలకు తీర్చుకోలేం తల్లీ.." అని చేయెత్తి నమస్కరించాయ్.

ఆ రోజు రాత్రి మాలగూడెం మత్తుగా త్రాగి మజాగా గడిపివేసింది. గొంతేలమ్మ పండుగనాటిలా గంతులు వేసింది.

మనో ప్రక్క ఊళ్లో బాగా ప్రొద్దు పోయేవరకూ జనం విజయ గురించే చెప్పుకున్నారు. నాగయ్య ఇలాంటి బిడ్డను కన్నందుకు శ్రద్ధాంజలి ఘటించారు.

# 5

ఇదివరలో —

ఇంటికి ఎవరైనా చుట్టాలు వస్తే ఎప్పుడు వెళ్తారన్నట్టు నాగయ్య చూసేవాడు. కనీసం పొగాకు ముక్క అయినా అడుగుతారేమో అని దూరదూరంగా వుండేవాడు.

ఇక ఇప్పుడు —

ఆ ఇంట్లోనూ, ఇంటిముందూ ఎంతమంది తిరుగుతున్నారో, ఎందుకు తిర్గుతున్నారో ఎవరికీ తెలియదు. ఆ చుట్టు ప్రక్కల ఏపని వున్నా సరిగ్గా వేళకి బిల బిల మంటూ భోజనాల సమయంలో ప్రత్యక్షమయ్యేవారు.

విజయ ఆలోచనే వేరు.

అలాగని తన క్రింద పని చేసేవాళ్లు సోమరులుగా తయారు కాలేదు. అదే విచిత్రం. తను యూనివర్సిటీలో ఆర్థిక శాస్త్రం నేర్చిన పాఠం.

"చల్లటి తల్లి" అంటూ విజయను తల్చుకొని రెట్టింపు ఉత్సాహంతో జనం పనిచేశారు. అధికంగా పంటలు పండించి ఆమె మెప్పును పొందడానికి ప్రయత్నించారు.

'ఏ నాగయ్య మాలపల్లెరు పురుగుగా చూశాడో

ఇప్పుడు ఆ మాలపల్లెను క్రొత్తగా నిర్మించిన 'నాగయ్య నగర్'లో నివసించడం నిజంగా ఆ ఊరి చరిత్రలోనే ఒక ఉజ్జ్వలమైన ఘట్టం' అని సరళ ఉత్తరం వ్రాసింది'

'ఈ ఘటం వుండగా ఇలా జరగడం నేను చూడలేను' అన్నాడు గుమస్తా.

ఒక వైపు నాగయ్య పేరు దశదిశలా వ్రాకిపోయినా, తనకు హారతి పట్టినా ఆమె ఉప్పొంగి పోలేదు.

'వంద ఇళ్ళు ఆధునిక పద్ధతులతో పేదవారికి కట్టించి ఇచ్చినంత మాత్రాన సమస్య తీరిపోయిందా ?' విజయ సందేహం.

'కాని - వాతావరణం మనుషుల్ని మారుస్తుంది. ముందు మనుష్యులు విద్యావంతులైతే దేశంలో దారిద్ర్యం కొంత తగ్గుతుంది.'

ఆ ఆలోచన రావడంతో విజయ ఆ నాగయ్య నగర్‌లో ఒక చక్కటి పాఠశాల స్థాపించాలనుకుంది.

నెల రోజుల్లో భవనం తయారై పోయింది.

జనం ఆవులింతలు ఆపారు. నిద్రనుంచి లేచారు. ఏమిటీ విప్లవం ? ఏమిటీ త్యాగం ? ఇవే ప్రశ్నలు. వీటి గురించే ఆలోచనలు.

పాఠశాల ప్రారంభోత్సవానికి విజయ వచ్చినప్పుడు ఆమె అన్నమాటలు ఇవి :

"మా నాన్నగారి పేరు చిరస్థాయిగా వుండాలని ఈ పనికి పూనుకున్నాను. ఈ పేరు మీరంతా నిలబెట్టుకుని కోరు

తున్నాను. ఇందులో పగలు పిల్లలు, రాత్రుళ్ళు పెద్దలు చదువుకోవచ్చు. ఇందులో చదివిన ప్రతివిద్యార్థీ, విద్యార్థినీ దేశానికి ఉపయోగపడాలి."

హర్షధ్వానాలు మిన్నుముట్టాయ్.

విజయ ఆ జయజయధ్వానాలకు కూడా ఉబ్బితబ్బిబ్బు కాలేదు. ఇంటికి వెళ్లింది. అమ్మమ్మ గొణుక్కుంది. మేనమామ ధుమధుమలాడాడు. చిన్నాన్న మాట్లాడడం మానివేశాడు.

'మనుష్యులు ఎందుకు ఇంత సంకుచితత్వంగా వుంటారు? ఇంటాబయటా ఎందుకిట్లా అసూయతో క్రుంగిపోతుంటారు? ఎక్కడుంది లోపం? అందర్నీ మనం ఎందుకు ప్రేమించలేక పోతున్నాం.? 'నాది'అని ఎందుకు వ్రేలాడుతున్నాం? ఈ అసూయ, స్వార్థం, ఒంటెత్తుగుణం పోవా? ఒకర్నిచూసి మరొకరు క్రుళ్ళిక్రుళ్ళి ఏడ్వకుండా సంతోషంగా వుండలేరా?'

ఇట్లా విజయలో ప్రశ్న పరంపరలు రేగిపోయాయ్. విజయ చేసేఖర్చుకు గుమస్తా తెల్లబోయాడు. కాని ఆమె ఔదార్యాన్ని, ఔన్నత్యాన్ని పత్రికలు పెద్దపెద్ద శీర్షికలుపెట్టి ప్రశంసించాయ్.

అయినా విజయలో అశాంతి ఆరిపోలేదు.

తనకు పుస్తకం అంకితం ఇస్తానని వచ్చిన ఒక కవిపుంగవుణ్ణి "మనుషుల్ని మార్చడం ఎట్లా? మనలో మానసిక విప్లవం ఎట్లా వస్తుంది? ఎప్పుడు వస్తుంది? దయ వుంచి చెప్పండి" అని అడిగింది.

ఆ భావకవి బిత్తరపోయాడు.

"మీ పుస్తకం నాకు వద్దు. మీరు వెళ్ళండి. మీరు వచ్చింది డబ్బుకోసం. డబ్బులేని ఒక పేద వాడికి మీ పుస్తకం ఎందుకు సమర్పించరు? అంతా బూటకం..."

భావకవికి భావాలు రాలేదు.

మరోసారి ఒక చిత్రకారుడు వచ్చాడు.

"అద్భుతమైన ఈ చిత్రకళా నైపుణ్యం చూడండి... ఒక ప్రక్క సెలయేరు..."

"దయవుంచి మీరు వెళ్ళండి. నాకు చిత్రకళ గురించి తెలియదు. మీ రంగులూ, రేఖలూ నాకు అర్థం కావు. ఎవరి కోసం ఈ చిత్రాలు? ఏమిటి ఇందులోని సందేశం? మీ చిత్రం చిత్రమైన ఊహలు కల్గించి నన్ను ఉత్తేజితురాల్ని చేయడం లేదు. హృదయాన్ని స్పందించలేని కళ గురించి నా దగ్గర ప్రస్తావించకండి. శెలవు."

విజయను ఏ విధంగా ఆకర్షించాలో ఆ చిత్రకారునికి కూడా అర్థం కాలేదు.

మరోసారి ఒక రాజకీయవాది వచ్చాడు. తమ పార్టీకి విరాళం ఇవ్వమన్నాడు,

"ఎందుకు?" అంది విజయ.

"ప్రజల కోసం మా పార్టీ కృషిచేస్తోంది. ప్రజల అభ్యున్నతికోసం ఖర్చుపెడుతుంది" అన్నాడా యువకుడు.

"మీరు చేసేపని నేనే చేయగలను. ఇక మీరు వెళ్ళండి" అంది కోపంగా.

"మీరు చాలా అహంకారంతో మాట్లాడుతున్నారు. మనిషిలోని అహంకారం దెయ్యం లాంటిది"

విజయ స్థంభించి పోయింది.

"అంటే మీ ఉద్దేశ్యం ?"

"మీరు చేసేది మీ గ్రామం కోసం. మీ చుట్టూ మిమ్మల్ని పొగిడే మనుషుల కోసం. మీ నాన్నగారి కీర్తి ప్రతిష్టలు పెరగడం కోసం. మేము చేసేది మానవ కళ్యాణం కోసం. సమాజంలో ఆర్థిక వ్యత్యాసాల్ని రూపుమాపటం కోసం. అజ్ఞానం మీద, దారిద్ర్యం మీద, అన్యాయం మీద మేము నిరంతరం పోరాటం ప్రకటిస్తాం. మేము ఊపిరి పీల్చేది, బ్రతికేదీ సమస్త ప్రజల కోసం. మాకు ఒక సిద్ధాంతం వుంది. ఒక ప్రణాళిక వుంది. మీకు అవి లేవు. ఔనంటారా ?"

విజయ తలవంచింది.

"అయితే నన్నేం చేయమంటారు ?"

"మా పార్టీకి విరాళం ఇవ్వక పోయినా నిజంగా మీకు దేశం బాగుపడాలని వుంటే మీ ఊరి నుంచే ఒక దిన పత్రిక స్థాపించండి. ప్రజల్లో విజ్ఞాన వికాసాలు కల్గించండి. ప్రజల్లో చైతన్యం వస్తుంది. నూతన ఉత్సాహంతో, దేశభక్తితో మీ కళ్ళ ఎదుటే ముందుకు సాగిపోతారు. అప్పుడు మీరు చదివిన చదువుకు, మీరు కూడబెట్టిన డబ్బుకు విలువ వుంటుంది"

అతని మాటల ధోరణికి ఆశ్చర్యపోయింది. మంత్ర

ముగ్ధురాలై పోయింది. ఆనందం పట్టలేక "అయితే ఇప్పుడు మనకు కొన్ని దిన పత్రికలు వున్నాయ్ కదా ?" అంది.

"అయినా అవికూడా కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడి వున్నాయ్. ఉన్నా ఫర్వాలేదు. కాని ప్రతిభావంతుడైన, నిష్పాక్షిక బుద్ధిగల ఒక పత్రికా సంపాదకుడ్ని వెదకి పట్టుకోండి. అప్పుడు ఉన్నదున్నట్లు పత్రికా రచనలో చక్కటి సాంప్రదాయాలు, ఉన్నత ప్రమాణాలు నిలబెట్టి నడపడం జరుగుతుంది. ప్రజలో చురుకుదనం వస్తుంది. ఆలోచనా శక్తి పెరుగుతుంది.

"మీ పేరు ?"

"నా పేరు మీకు అనవసరం. పత్రిక పేరు ఏమిపెడితే బాగుంటుందో అడగండి. చెబుతాను,"

"ముందు మీరు భోజనం చేయండి. తర్వాత మాట్లాడదాం."

రాజకీయవాది నవ్వుకున్నాడు. అతనికి భోజనం స్వయంగా విజయ వడ్డించింది.

ఆయనకు ఒక వ్యక్తిని ఇట్లా చర్చల్లోకిదింపి తన వైపుకు త్రిప్పుకోనడం ఇది మొదటిసారికాదు. కాని అలాంటి విజ్ఞాని, వక్త ఎదురుపడడం విజయకు ఆనందాశ్చర్యాలు కల్గించాయ్.

భోజనం పూర్తిఅయింది.

అతడు సిగరెట్టు ముట్టించాడు.

"పత్రిక పేరు ఏం పెడదామంటారు ?"

"మేలుకొలుపు"

"ఔను, నన్ను కూడా మేలుకొల్పారు."

రాజకీయవాది సన్నగా నవ్వాడు. ఉషారుగా పొగ వదిలాడు.

"దినపత్రిక ప్రారంభించడానికి ఎంత కావాలి?"

"మీరు వెంటనే ఇక్కడ ప్రారంభించాలంటే సుమారు ౩ లక్షలు వుండాలి. అదిసరే. మీరు భోజనం చేశారా ?" అన్నాడు.

"భోజనం చేయకపోయినా కడుపు నింపినట్లేవుంది" అంది విజయ.

"మాటల కేమిటిలెండి. ఇట్లా ఎన్ని అయినా చెప్ప వచ్చు. మీరు భోజనం చేసిరండి"

"భోజనం చేశాను. గాని ముందు చెప్పండి. మీరు ఇంత చిన్న వయస్సులో ఇంత విజ్ఞానాన్ని ఎట్లా సంపాదించుకో గల్గారు ?

"మీరు మరోలా అనుకోకపోతే ఒక విషయం చెబుతాను. నేను ఏమీ చదువుకో లేదు. 11 వ ఏట రాజకీయ రంగంలోకి దిగాను. ఇప్పుడు నాకు పాతికేళ్ళు. రెండు సార్లు సత్యాగ్రహం చేశాను. మూడుసార్లు లాఠీ దెబ్బలు తిన్నాను. ఒకసారి జైలుకు వెళ్ళాను. వందలాది సభల్లో మాట్లాడాను. వేలాది ప్రజల మధ్య తిర్గాను. నాకు అనుభవం లేకపోతే

పుస్తకాలు మాత్రమే చదివిన మీలాంటి వాళ్ళకు వస్తుందా ప్రపంచ అనుభవం ?"

"మీలా ఇంత సూటిగా మాట్లాడిన వాళ్ళను నేను ఎక్కడా చూడలేదు" అంది విజయ.

"ఇప్పుడు చూడడం కూడా ఒకందుకు మంచిదే అయింది లెండి."

విజయ మాట్లాడలేదు. ఆమెకు అవేవో ఊహాలు కల్గాయ్.

"మీకు పెళ్ళి అయిందా ?"

మొదటిసారిగా ఏ యువకుడ్నీ ఏ పెళ్ళిగాని యువతీ అడగని ప్రశ్న వేసింది విజయ.

"కాలేదు. కాని పెళ్ళి ఎట్లా చేసుకోనేది ?" అన్నాడు నవ్వుతూ.

విజయ ఉలిక్కి పడింది.

అతని కళ్ళల్లోకి చిత్రంగా చూసింది.

"అంటే..."

"ఇక్కడ మీరు అన్నారు కనుక ఈ వేళ మీ ఇంట్లో భోజనం చేశాను. మళ్ళీ రేపు ఎక్కడుంటానో ? భోజనం వుంటుందో లేదో ? అలాంటప్పుడు నేను పెళ్ళి చేసుకుంటే నా భార్య ఏంకావాలి ? ఏం చూసి మురిసిపోవాలి ?"

ఏం చెబుతుంది విజయ ?

"కాని....."

"మీ సందేహం నాకు అర్థమైంది. మీరు ఆడవారు అయిపోయారు. లేకపోతే ఇంకా లోతుకు దిగి చర్చించే వాణ్ని. అయినా పోనివ్వండి. నేను పిల్లల్ని కని దేశం మీద పడ వేయనందుకు నాకు చాలా గర్వ కారణంగా వుంది."

అతను మరో సిగరెట్టు వెలిగించాడు.

"కొంచెం విడమర్చి చెప్పండి" విజయ వినయంగా వేడుకొంటున్నట్లు అడిగింది.

"మీరు నిత్యం అనేకమంది నిర్భాగ్యుల్ని చూస్తున్నారు. కొంపా గోడు లేని వ్యక్తులు - అంటే ముష్టివాళ్ళు, ఉప్పరవాళ్లు, లంబాడీలు, యానాదులు, వెట్టివాళ్ళు, ఎరుకలవాళ్లు చెట్టూపుట్టా పట్టుకొని వ్రేలాడే ఈ దౌర్భాగ్యులకు ఏ వినోదమూ, వ్యాపకమూ లేక పగలు శ్రమించి, రాత్రుళ్ళు జౌను. ఇట్లా ఒక ప్రక్క వ్యాధులు, మరో ప్రక్క దారిద్ర్యం, అనారోగ్యం, అజ్ఞానం...ఎందుకు భారత దేశానికి ఈ జనాభా పెరుగుదల?"

విజయ కళ్ళప్పగించి ఊరుకుంది.

"ఒకొక్కడూ ఒకొక్క వీరుడుగా, దేశభక్తుడుగా, విజ్ఞానిగా, వైజ్ఞానిక వేత్తగా, రచయితగా రాజ్యాంగవేత్తగా నాయకుడుగా, మహాగాయకుడుగా, మేధావిగా, చిత్రకారుడుగా, ఇంజనీరుగా, వైద్యుడుగా, విద్యావేత్తగా, తత్వవేత్తగా తయారు కావాలంటాను. చాకుల్లాంటి, మెరికల్లాంటి వ్యక్తుల్ని మనం పుట్టించుకోవాలి. తయారు చేసుకోవాలి. పెరగనివ్వాలి. కాని ఈ నిర్భాగ్యులవల్ల మరికొంతమంది

నిస్సహాయులు తయారవుతున్నారు. దీన్ని మనం అరికట్టాలి. ఎట్లా అంటారా ?"

విజయ 'చెప్పండి' అన్నట్లు చూసింది.

"ముందు ఈ పేదవాళ్ళ జీవన ప్రమాణాన్ని పెంచాలి. పెంచడం ఇంతలో సాధ్యంకాదు. అందుకని మనం ముందు కుటుంబ నియంత్రణం తేలిగ్గా అమలుపర్చవచ్చు. కాకపోతే ఈ పేదవాళ్ళ నైతికతని దాన్ని బలవంతంగారుద్దాలి. ఒక ముష్టి వాడికి పిల్లవాడుపుడితే వాడు ముష్టివాడుగానే ఇప్పట్లో తయారవుతాడుగాని, ఇంతలో డిగ్రీపుచ్చుకొనేటట్లు చేయ గలమని ఆశించగలమంటారా ?"

"ప్రజల్లో తిరుగుబాటు వస్తుందేమో!"

"మన పోరాటమంతా ముందు ఆకలిమీద. వాడికి ఆకలిబాధ తీర్చాలి. ప్రాజెక్టులు కట్టినా. ఫ్యాక్టరీలు లేచినా వాడికి ఆనందంకాదు. అయినా ఏ మంచిపనికైనా ముందు గగ్గోలుపుడుతుంది. అట్లాగని ఈ ప్రభుత్వ చట్టాలు ఆగిపోవు. కార్యక్రమాలు నిల్చిపోవు. ప్రణాళికలు సాగిపోతూనే వుంటాయ్."

"ఈ చట్టాలు ప్రజల్ని బాధపెట్టేటట్లుగా వుండ కూడదుగా."

"మంచి ప్రశ్న వేశారు. వాళ్ళు ఓట్లు ఇచ్చి ప్రతినిధుల్ని ఎన్నుకుంటారేగాని, ఇది మంచిదా కాదా అని అలాంటి వాళ్ళు తేల్చలేరు. మనం, మన అసెంబ్లీలు, పార్లమెంటు,

కోర్టులు తేల్చాలి. మనం చిత్తశుద్ధితో ఏం చేసినా ఫర్వా లేదంటాను."

"ఆ చిత్తశుద్ధి వుంటే దేశం ఇట్లా ఎందుకుంటుం దంటారు?" అని అడిగింది విజయ.

"నిజమే, కొందరిలో కొన్ని లోపాలున్నాయ్. కొన్ని చోట్ల ప్రభుత్వం తప్పటడుగులు వేస్తోంది. వాటిని సరిదిద్ద డానికి, మీరూ, నేనూ, అందరం కృషిచేయాలి కదా."

"మీతో నేను వాదించలేను" అంది విజయ.

"నేను చెప్పేది అబద్ధమంటారా? ఏమైనా మనకు ముందు మేధావులు అవసరం. వారిని మీరు పిలిపించండి."

"పిలిపించి ఏం చేయమంటారు?"

"వాళ్ళకు తగిన వసతులు కల్పించండి. వాళ్ళ బుద్ధి పాదరసంలా పనిచేస్తుంది. కొందరు 'థీసిస్' రాస్తారు. దాన్ని మరి కొందరు అమలు పరుస్తారు."

"చేసి..."

"మనం కోరేది నిత్యకళ్యాణం, స్వాతంత్ర్యం. స్వేచ్ఛా ప్రపంచం. అభ్యుదయ పథంలో నడిచే సమాజం. శాంతీ, క్రాంతీ రావడానికి ముందు మేధావులు ఆర్థిక సంక్షోభం నుంచి బయట పడాలి. మీరు ఖర్చుపెట్టే ప్రతిపైసా సద్వి నియోగం అవుతుంది."

"మీరు చెప్పేది నాకు అయోమయంగా వుంది." మీరు పత్రిక పెట్ట బోతున్నారు. దాంతో పాటు దిట్టమైన

విద్యావేత్తల సలహాతో, ఒక కళాశాల స్థాపించండి. ఎంతో సామర్థ్యం, అనుభవం వున్న అధ్యాపకుల్ని నియమించుకోండి. పేదవారైనా, ఉన్నవారైనా అపారమైన తెలివి తేటలు వున్న విద్యార్థుల్నే అందులో చేర్చుకోండి. వివిధ విషయాలూ, వృత్తులూ నేర్పండి. ఇక చూడండి. కళాశాలలో చదివిన ప్రతి వ్యక్తి దేశానికి మహోపకారం చేసేలా చూడొచ్చు," అని లేచాడు.

"ఎక్కడికి వెళ్తున్నారు ?"

"ఉదయం వచ్చాను. అప్పుడే చీకటి పడుతోంది. నేను నిడదవోలు వెళ్ళాలి. ఇంకా చాలా చాలా పనివుంది. ఈ చంద్రమౌళి వెయ్యాళ్ళ పూజారి"

"మరి దిన పత్రిక మాటేమిటి ? మీరు ఊరికే కబుర్లు చెప్పడమేనా ? కార్యరంగంలోకి దుమికి కార్యం పూర్తి చేయడం లేదా చంద్రమౌళిగారూ ?"

అతను నవ్వి మళ్ళీ కుర్చీలో కూర్చుండి పోయాడు.

అట్లా విజయ చంద్రమౌళితో ఒక్క రోజు కాదు. ఆరు రోజులు దీర్ఘంగా చర్చలు సాగించింది. ఆరు రోజులు ఆరు గంటలుగా గడిచిపోయాయ్. ప్రతిక్షణం, ప్రతిమాట ఆమె హృదయాన్ని పట్టి నిల్చిపోయాయ్.

ఒక్కొక్క వ్యక్తి ప్రభావం ఒక్కొక్క సారి విపరీతంగా

మనపై పడడం ఖాయమని విజయ మొదటిసారిగా గ్రహించింది.

అతను ఎక్కడ ఇక్కడనుంచి వెళ్ళిపోతానంటాడోనని భయపడింది.

# 7

అందాలు చిందే తన ప్రతిబింబం అద్దంలో చూచుకొని చాలా కాలానికి విజయ మురిసిపోయింది. ఆ చిలిపివళ్లీ ఆసిగ్గూ విజయను తియ్యటి ఊహల్లో ఊగించాయ్.

చంద్రమహాళి తనని అపారంగా ఆకర్షించాడు. తన హృదయంలో- అడ్డుపెట్టబోయినా- అనుకోకుండా ప్రవేశించాడు. కారణం తను ఇదమిద్ధంగా చెప్పలేదు. కాని అతని మేధా సంపత్తికి, నిజాయితీకి విజయ గర్వపడింది.

ఒకొక్కరిని ఒకొక్కరు ఆకర్షిస్తారు. అనురాగాలు చిలికిస్తారు. ఎందుకని ?

ప్రతిమనిషిలో ఏదో ఒక విశేషం వుండకపోవచ్చు. ప్రతివాడూ మంచివాడు కాకపోవచ్చు. చంద్రమహాళిలా గంటల తరబడి అనర్గళంగా మాట్లాడక పోవచ్చు. కాని మరి అతని గొప్పతనం ఏమిటో చెప్పకోలేకుండానే అతన్ని చూసి పరవశురాలై పోయింది.

అంతవరకూ అశ్రద్ధ చేసిన అలంకరణకు కన్నుగీటింది.

ఎర్రటి బుగ్గలు నిమిరింది. చిలిపిగా నవ్వింది. జారిపోతున్న పైట చెంగును మందలించింది.

రాత్రిం బవళ్ళు చంద్రమౌళి ధారాళంగా, నూటిగా చెప్పిన విషయం చెప్పకుండా మాట్లాడడం విజయలో ఉత్సాహం రేకెత్తించింది. ఇంకా ఇంకా వినాలనిపించింది.

ఒకొక్కక్కసారి అతని వాదనకు నిశ్చేష్టురాలవుతుండేది. అతను మధ్య మధ్య "ఔనంటారా ?" అని అడిగినప్పుడు సమాధానం చెప్పలేక పోయేది.

అట్లా గంటలూ రోజులూ గడిచిపోవడం ఇరువురికీ తెలియలేదు. చంద్రమౌళి రెండు మూడు సార్లు వెళ్ళిపోవ డానికి ఉపక్రమించాడు.

"వెళ్ళేటందుకుగాని లెండి" విజయ విజ్ఞప్తి.

"తంతి, తపాలా సౌకర్యాలు ఏర్పడ్డాయ్. విద్యుచ్ఛక్తి కూడా సరఫరా అవుతోంది. భవనాలు పూర్తి అయిపోయాయ్. కావలసిన యంత్రాలు వస్తున్నాయ్. ఇక అంతా మీరు చూసుకోవచ్చు. నేను వచ్చి చాలారోజులైంది. అనుకో కుండా ఇక్కడ వుండిపోయాను."

"ఇప్పుడు వచ్చిన నష్టం ఏమిటి ?"

"నేను వుంటే మీకు కలిగే లాభం ఏమిటి ?"

ఔను. ఏమిటి ?

ఆ ప్రశ్నకు విజయకాదు ఆ పరిస్థితుల్లో ఆ స్థానంలో వున్న పదిమంది విజయలుకూడా సమాధానం చెప్పలేరు.

"మీకు అసౌకర్యంగా వుందా?" విజయ బాధగా అడిగింది.

"ఎంత మాటన్నారు. ఇంద్రలోకంలో ఎవరికైనా ఇబ్బందిగా వుంటుందా?"

ఆ మాటలకు అర్థం విజయకు బోధ పడలేదు. కవుల మాదిరిగా రాజకీయవాదులు కూడా ఒక్కొక్కసారి వ్యంగ్య ధోరణిలో మాట్లాడుతుంటారు కాబోలనుకుంది.

విజయ ప్రక్కనున్న పత్రిక తీసి చదవడానికి ఉపక్రమించింది. అది చదవడం కాదు. అది ఆలోచించడం.

"నాకు కాఫీ కావాలండీ"

విజయ చటుక్కున లేచింది. అల్మారాలో వున్న ఫ్లాస్క్ తీసి, కప్పుల్లో కాఫీ పోసింది.

"మీరుకూడా తీసుకోండి"

విజయ అక్కర లేదంటూ తల ఊపింది.

"మీరు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటారు. నేను మొదట్లో ఇక్కడకు వచ్చినప్పుడున్న సంతోషం ఇప్పుడు మీలో చూడక లేక పోతున్నాను. మీకు నేనేమైనా బాధ కల్గిస్తున్నానా?"

"ఏం మాటలండీ అవి? ముందు కాఫీ త్రాగండి." అంటూ విజయ కాఫీ అందించింది.

చంద్రమౌళి కాఫీ త్రాగి సిగరెట్టు ముట్టించి "మీరు పెళ్ళి చేసుకోవలసిందే" అన్నాడు.

"ఎందుకు ?" అంది విచిత్రంగా.

"నిజంగా ఈ ప్రశ్న గురించి మనం దీర్ఘంగా ఆలోచించవలసిందే. పెళ్లి దేనికి ? ప్రతి పురుషునికి, ప్రతి స్త్రీకి కొన్ని కలలు వుంటాయ్. వాంఛలు వుంటాయ్. వాటిని వద్దనుకున్నా అసహ్యించుకున్నా మూర్ఖత్వమే అవుతుంది. అంతే కాదు పెళ్లి చేసుకోనడం వల్ల కొందరి జీవితాలు దుర్భరమవుతాయ్. మరి కొందరి జీవితాలు ఆనందదాయకమవుతున్నాయ్. మొదటి దానికి కారణం అనుకోని సమస్యాలు. వల్లమాలిన బాధలు. ఎక్కువగా ఆర్థిక బాధలు. ఆ చికాకు చిటపటలు వల్ల దాంపత్య జీవితంలో పరస్పర ప్రేమానురాగాలు నశించిపోవడం...అయినా మానసిక సౌందర్యం, హృదయ ఔన్నత్యం తెల్సినవారు నూతన దంపతుల మాదిరిగానే వుంటారు. ఇంతకూ పెళ్లి చేసుకోనడం వల్ల జీవితంలో సిదానం, నిండుదనం, తృప్తి, హాయి కల్గుతాయ్. ఒక్కొక్కసారి పెళ్లి చేసుకున్న తరువాత జీవితాలే మారిపోతుంటాయ్. మీరు చూడవలసిందీ, తెల్సుకోవలసిందీ, అనుభవించవలసిందీ, చాలా వుంది విజయకుమారి గారూ..."

చీకటి పడింది.

చంద్రమూళి స్నానం అయింది.

"ఎన్నాళ్ళకు కమ్మటి పెరుగు తింటున్నాను" అన్నాడు.

"ఊ పొగడకండి" అంది అమృతపాణి అరటిపళ్ళు ఆకులో వేస్తూ.



రాత్రి 12 గంటల సమయం.

చలిగా, చీకటిగా వుంది.

బయట హోరుమని గాలి.

విజయ హృదయంలో కూడా హోరు గాలి.

బయట చెట్లు ఊగిపోయినాయ్. కిటికీ రెక్కలు దబ దబమని కొట్టుకున్నాయ్. ఇంట్లో అంతా నిద్రపోయారు.

మేడపైన ఒంటరిగా తను.

మేడ క్రింద గదిలో చంద్రమౌళి.

ఏమిటీ అనుబంధం ?

ఎందుకీ ఆకర్షణ ?

విజయ ఆ రాత్రికూడా నిద్ర పోలేకపోయింది.

# 8

మర్నాడు ఉదయం-

ఒక ప్రముఖ దినపత్రికలో కొన్నాళ్ళు సహాయ సంపాదకుడుగా పనిచేసి, పత్రిక విధానాలు నచ్చక బయటకు వచ్చి వేసి, నిరుద్యోగిగా వుంటున్న మురళి ప్రత్యక్షమయ్యాడు.

"ఇంత ఆలస్యం చేశావేమిటి ?" చంద్రమౌళి ఆత్రుతగా అడిగాడు.

"రావడానికి డబ్బులు లేవు" నిస్సంకోచంగా అంటున్న ఆమాటలకు విజయవుంటే అతన్ని ఎగాదిగాచూసేది.

చంద్రమౌళీ, మురళీ చాలాకాలంనుంచి మంచి స్నేహితులు. చంద్రమౌళి గంభీరంగా బల్లగుద్ది మాట్లాడుతాడుగాని, ఒక్క అక్షరం కాగితంమీద రాయలేడు. మురళి ఎన్నివందలు పేజీలైనా కలం ఆపకుండా అద్భుతంగా రాస్తాడుగాని, వేదిక మీద వణికిపోతాడు.

భిన్న ప్రవృత్తులుగల ఆ ఇద్దరూ చాలాకాలం కలిసి మెలిసి తిర్గారు. అభిప్రాయభేధాలువచ్చి అప్పుడప్పుడు విడిపోవడం కద్దు. మళ్ళీ ఎప్పుడైనా ఎక్కడైనా కనిపిస్తే, కల్లాకపటం లేకుండా కౌగలించుకుంటారు.

విజయ వచ్చింది.

ఇద్దరికీ చంద్రమౌళి పరిచయంచేశాడు.

"మీరు ఏయే పత్రికల్లో పనిచేశారు?" అంది విజయ.

"వాటిపేర్లు ఎందుకులెండీ. పగలంతా చాకిరీ. మిగిలింది పస్తు. ఇక్కడకు మూడురంగుల ముఖచిత్రంతో పత్రిక వచ్చేది కాని అక్కడ మాకు ముఖాల్లో కాంతి వుండేది కాదు...అయినా జీవితంలో కొన్ని ఆదర్శాలు ఇట్లా బాధలు అనుభవించగలడా లేదా అని పరీక్ష చేస్తుంటాయ్" అన్నాడు మురళి.

విజయ అతని మనస్తత్వాన్ని అర్థం చేసుకుంది.

"ఏమిటి అత్యవసరంగా మాట్లాడాలని ఉత్తరాలు రాశేవ్?" అన్నాడు.

"ఒక దినపత్రిక పెడుతున్నామండీ" అంది విజయ.

వెంటనే చంద్రమహాళి అందుకొని "నీ భావాలు నీవే. మేము అడ్డు పెట్టం. దాంతో బాటు ఇతరుల భావాలకు కూడా పత్రికలో స్థానం ఇవ్వడం మర్చిపోకు. చివరకు పత్రికా నిర్వహణా భారం అంతా నాదే. ఆ పత్రిక ఆగడానికి వీలు లేదు. విజయ ఢంకా మ్రోగించాలి. ఏ మంటావ్ ?"

మురళికి స్వర్గసీమలో తేలిపోయినట్లయింది. కొన్ని క్షణాలు ఆనందంలో మాట్లాడ లేక పోయాడు.

"మాట్లాడవేం మురళీ ?

"నన్ను వేళాకోళం చేస్తున్నావా చంద్రమహాళీ ?

"అందుకే నిన్ను చూస్తే ఒక్కొక్కసారి జాలి. నేను హాస్యానికి అనడం లేదు. దిన పత్రిక ప్రారంభిస్తే బాగుంటుం దన్నాను. విజయకుమారి గారు అందుకు అంగీకరించి అయిదు లక్షల రూపాయలు దీనికి కేటాయించారు. మంచి సంపాద కుణ్ని పిలిపించమన్నారు. నేను బాగా ఆలోచించాను. అజ్ఞా తంగా పడివున్న ప్రతిభావంతుల్లో నువ్వొకడివని, అటువంటి ప్రతిభా శాలిని లోకానికి పరిచయం చేయాలని వీరితో అన్నాను. నువ్వు నాస్నేహితుడవని పక్షపాత బుద్ధితో ఈ పని చేయ లేదు,"

"ఏమిటి మీ సందేహం ?" అంది విజయ.

"ఏమీ లేదు. నా మీద అటువంటి సదభిప్రాయం మీ ఇద్దరకూ వున్నందుకు చాలా కృతజ్ఞుణ్ని. నా శక్తినీ,

మేధాశక్తినీ పత్రిక కోసం ధారపోస్తాను. ఇంతకూ పత్రిక పేరేమిటి ?" సిగరెట్టుకోసం చేయి చాస్తూ అడిగాడు మురళి.

"మేలుకొలుపు" అంది విజయ.

"ఏం బాగా లేదా ?" అన్నాడు చంద్రమౌళి సిగరెట్టు పెట్టె అందిస్తూ.

"కాని అంతకంటె 'ప్రజామిత్ర' అంటే బాగుంటుంది. అది ప్రజల నాలుకపై ఇట్టే పలుకుతుంది కూడా" అన్నాడు మురళి.

"రైట్. కానీయ్. ఇప్పుడే అన్ని దినపత్రికల్లో పెద్ద పెద్ద ప్రకటనలు చేయ్."

"మరి సంపాదకులెవరు ?" విజయ ముఖంలోకి చూస్తూ మురళి ప్రశ్నించాడు.

విజయ చంద్రమౌళి వైపు చూసింది.

"ఏం ప్రశ్న ? వ్రాసేది నువ్వు. దాని సాధకబాధకాలు చూసుకొనేది నువ్వు. మంచి అయినా చెడు అయినా అందు కోవలసిందీ, అనుభవించేదీ నువ్వు. ఈ పత్రికకు నీ పేరుతోనే డిక్లరేషన్ తీసుకో."

"సహాయ సంపాదకులుగా ఎవర్ని నియమించు కుందాం ?" మురళి మరో ప్రశ్న.

"అది కూడా నీ యిష్టమే. కాని ఒకటి మాత్రం మరిచి పోకు. మన పత్రిక పక్షపాత రహితంగా వుండాలి. అభిమానా లకు, అనుమానాలకు అతీతంగా నడవాల. మన మెంత నిర్భాగ

మోటంగా విమర్శిస్తామో అంత నిజాయితీగానూ నడుచుకొనే వాళ్ళను చూస్తా. ఏమంటారు విజయకుమారి గారూ ?"

"చాల్లెండి నన్ను అడుగుతారేమిటి ?" అన్నట్టు ఆమె చూసి లేచి లోపలికి వెళ్ళి పోయింది.

చాలామంది డబ్బు లేక అనేకసార్లు పనులువాయిదాలు వేసుకోవడం, అణుచుకోవడం సర్వసామాన్యమైన విషయం.

విజయ బ్యాంకు చెక్కులమీద సంతకాలు పెట్టడమే తరువాయి పనులు చకచక పూర్తి అయిపోయినాయ్.

## 9

గ్రామంలో క్రొత్తగా టెలిఫోన్, టెలిగ్రాఫ్, విద్యుచ్ఛక్తి టెలిప్రింటర్ సౌకర్యాలు వచ్చేశాయినాయ్. పత్రికను సకాలంలో నలుమూలలకూ అందించడానికి అరడజను వ్యానులు వాయువేగమనోవేగాలతో పోవడానికి సిద్ధంగావున్నాయ్.

సంక్రాంతి పండుగకు 'ప్రజామిత్ర' వెలువడింది. ఒక అజ్ఞాత దేశభక్తుడు ప్రారంభోత్సవం చేశాడు. దేశం నలుమూలల నుంచీ సందేశాలు, శుభాకాంక్షలు వచ్చాయి.

ఆ రోజు తొలి సంపాదకీయంలో వున్న వాక్యాలివి:

"అందరం ఆనందంగా జీవించడానికి ప్రయత్నిస్తాం. అందుకు ఎవరు అడ్డుపడినా ప్రజాభిప్రాయమనే పయనమైన ప్రజారథం క్రిందపడి పిప్పిపిప్పి అయిపోవడం తథ్యం."

ఆధునిక సౌకర్యాలు అంతగా లేని ఒక పల్లెటూరు నుంచి ఒక దినపత్రిక ఇతరపత్రికలతో పోటీపడుతూ తాజా వార్తలతో, చక్కటి శీర్షికలతో రావడం అనేకమందికి ఆశ్చర్యం కల్గించింది.

అయినా పత్రిక ప్రారంభించిన కొన్ని నెలలకే ఈ దిన పత్రిక కూడా మిగిలిన పత్రికలతో పోటీకి నిలబడగలదని రుజువు చేసుకుంది.

సహాయ సంపాదకులకు, సిబ్బందికి, విలేఖరులకు చక్కటిజీతాలు ఏర్పాటుచేయడంవల్ల, ఆపత్రికలో ప్రచురించ బడే ప్రతిరచనకు పారితోషికం ఇవ్వడంవల్ల 'ప్రజామిత్ర' ఒక ప్రత్యేక స్థానం అందుకోగల్గింది.

ఆంధ్ర ప్రజానీకం ఆదరాభిమానాలు పొందడంలో మురళి పడిన శ్రమ అంతా యింతా కాదు. అంతేకాకుండా తన క్రింద పనిచేసే 'చాకుల్లాంటి' వ్యక్తుల్లోని అణగి మణిగి వున్న సృజనాత్మకమైన రచనా శక్తినీ, అనువాద సరళినీ మురళి మేల్కొలిపాడు. అంతా కలిసి కట్టుగా, పట్టుదలగా పనిచేయడం వల్ల 'ప్రజామిత్ర' పాఠకులలో శహాభాష్ అని పించుకుంది.

మురళి వయస్సు సుమారు 35 సంవత్సరాలు. ముగ్గురు పిల్లలు. భార్య అనారోగి. ఆమె ఆలనా పాలనా చూడడానికి కూడా తీరుబడి లేని పాత్రికేయుడు.

ఉన్నా అదో ప్రపంచం. ఎప్పుడూ తనూ, తన కలం,

తన కాగితాలు, తన వార్తలూ. ఇంట్లోవున్నా బయటవున్నా ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుండేవాడు. చాలా మితంగా మాట్లాడేవాడు.

దాన్ని కొంతమంది గర్వం అనుకొనేవారు. కాని అది గర్వం కాదు. పరధ్యానం. ఆ పరధ్యానంలో అతను తీక్షణంగా ఆలోచించ గలిగేవాడు. సూటిగా, ఘాటుగా వ్రాయ గలిగేవాడు.

ఈనాడు రాసిన మరుక్షణంలో అతని అక్షరాలు అచ్చుపడడంలో అబ్బురం లేదు. కాని కొన్ని సంవత్సరాల క్రితం-

మురళి సామాన్యుల కుటుంబంలో పుట్టాడు. తల్లి దండ్రులు అంతగా ఇంతగా ఆలోచించేవారు కారు. గంపెడు పిల్లలు వుండడం చేత, ఇల్లు ఈసురోమంటూ వుండేది. ఒక పూట వుంటే మరో పూట పస్తు.

తదితర మధ్య తరగతి కుటుంబాల మాదిరిగానే గుట్టుగా జీవించడం నేర్చుకున్నారు. తెక్కాడితేగాని డొక్కాడదని ఆ కుటుంబంలో దారిద్ర్యం తాండవిస్తుండడం వల్ల మురళి మొదట్లో ప్రెస్సులో ప్రవేశించాడు. అక్కడ నెమ్మదిగా పని నేర్చుకున్నాడు.

అక్కడకు అనేక రకాల కరపత్రాలు, పుస్తకాలు వస్తుండేవి. అవి అచ్చుకూర్చడం, చదవడం, సరిచేయడం అతని పని.

ఇట్లా రాను రాను భాషగురించి, భావం గురించి అతనికి కొన్ని అభిప్రాయాలు ఏర్పడ్డాయి. పగలంతా శ్రమించి ఇంటికి వెళ్ళేవాడు. ఆఖున వెళ్లినా, ముందు వెళ్ళినా ఎనమండుగురు పిల్లలతో ఆ ఇల్లు సంతలావుండేది. అన్నం వున్నా సహించేది కాదు. తిండా మనుకున్నప్పుడు ఒక్కొక్క సారి అన్నం వుండేది కాదు.

బాల్య జీవితం ఈ విధంగా కష్టాలతో దొర్లింది.

అతనిలో ఆలోచనలు రేగాయి.

కొందరే ఎందుకు సుఖంగా వుంటున్నారు?

ఎందుకు మరి కొందరు పొట్టకోసం ప్రాకులాడవలసి వస్తోంది? అదృష్టమా? కొందరు చేసుకున్న కర్మ ఇదంతా? కాకపోతే ఈ సంఘం, ఈ ప్రభుత్వం ఏం చేస్తున్నట్టు?

వీటినీ కథలుగా, వ్యాసాలుగా అల్లి చిన్నచిన్న పత్రికలకు పంపేవాడు. వాటికి డబ్బులు లేక ఒక్కొక్కసారి ఆలస్యంగా పోస్టు చేసేవాడు. ఎప్పుడు పంపినా అవి వరుసగా తిర్గి వస్తుండేవి. దాంతో అతనిలో నిరాశ, విజృంభించేది. మళ్ళీ ఆశ లెంపలు వాయించేది.

అయినా ఎప్పుడో ఒక రచన పడుతుండేది. ఆనాడు నిజంగా పండుగగా వుండేది.

చదువుకొనకపోతే తన తండ్రి చిన్నప్పటినుంచీ ఇప్పటివరకూ దర్జీగానే బ్రతికినట్లు, తనుకూడా ఆ అచ్చు యంత్రాలకే అంటుకొని పోవలసి వస్తుందని పాఠశాలలో ప్రవేశించాడు.

'అట్లా చదువుకొనే రోజుల్లో ఒక కథకు ఒక పత్రికా సంపాదకుడు అయిదు రూపాయలు మనియార్డరు పంపాడు. దాంతోబాటు రెండు వాక్యాలు : రత్నమాణిక్యాల్ని ప్రజలు ఎప్పటికైనా గుర్తిస్తారు. మీలాంటి వారి వల్లనే దేశం బాగుపడుతుంది.

మురళి ఆ నాడు పొందిన ఆనందానికి అంతులేదు. ఆ రోజునుంచి అతనిలో నూతనచైతన్యం వచ్చింది. దాంతో మరింతగా వాస్తవికతకు కల్పనా శక్తి జోడించి చెప్పడంలో సొగసు చూపిస్తూ పాఠకుల దృష్టిలో పడ్డాడు.

అట్లా అతని రచనలు మెచ్చుకున్న పఠితలలో ఒకరు ఇప్పటి అర్ధాంగి. ఒకపూట తిండి వుండి, మరోపూట లేక పోవడం, పుస్తకాలు కొనుక్కో-లేక, వాళ్ళనూ వీళ్ళనూ దేవు రించడం, ఏమాత్రం తీరిక వున్నా ఎవరితోనూ మాట్లాడక పోవడం, నిత్యం ఎన్నెన్నో గ్రంథాలు చదవడం సావిత్రి పసి గట్టింది.

సావిత్రి ఆ ఊళ్లో ఒక పత్రికా విలేఖరి కుమార్తె. వారింటికి తరచు మురళి వస్తూ పోతుండడంవల్ల అది క్రమేపీ ప్రేమగా మారింది. విడిపోతే భరించలేనంత అనురాగం ఏర్పడింది.

మురళీని త్రోసిపుచ్చలేక, వచ్చిన సంబంధాలను ఖాతరు చేయక తల్లిదండ్రుల మాట వినక ఇతనితో లేచి వచ్చి వేసింది. ఆమె స్నేహితురాండ్రు, బంధువులు 'ఇదేం పని ?' అన్నారు.

"హృదయం బజారులో దొరికే వస్తువుకాదు. నేను ఆయన్ని ప్రేమించాను. నా ప్రాణం వున్నంతవరకూ ప్రేమిస్తాను. నేను ప్రేమించేది పైపై ధగధగలుకాదు. నేనుచూసేది హృదయం నిగనిగలు" అంది.

అన్ని వార్తలూ పంపించే సావిత్రి తండ్రి ఈ వింత వార్తను తన పత్రికకు ఎలా పంపించగలడు ?

మురళికూడా వర్థి నాస్తికుడు.

"పెండ్లిపీటలమీద దేవునిముందు నీకు మంగళసూత్రం కట్టమంటావా సావిత్రీ ?" అన్నాడు నవ్వుతూ మురళి.

"ఆ. దానికోసం టైమ్ పాడుచేయడంకూడా దేనికిలెండి. మీరు ఈలోపుగా ఒక పుస్తకం చదువుకోవచ్చు" అంది క్రీగంటి చూపులు చూస్తూ.

మురళి పకపకమని నవ్వాడు.

హృదయ సౌందర్యం తెల్సిన వ్యక్తుల మధ్య ప్రేమ శాశ్వతంగా వుండిపోతుంది. ఇద్దరూ దూరంగా వెళ్ళిపోయి, తిరిగితిరిగి చివరకు విజయవాడ చేరుకున్నారు.

అక్కడకూడా పరిస్థితి మామూలుగానే వుంటానని భీష్మించుకొని కూర్చుంది. ట్రెజరీలో ఉద్యోగం చేయడం ఇష్టంలేక వదులుకున్నాడు.

"ఎందుకని ?" అన్నారు కొందరుమిత్రులు.

"నాకు లెఖ్ఖలురావు. లెఖ్ఖలువస్తే నేను ఆఫీసులో ఎందుకు చీవాట్లు తింటాను ? అసలు నేనుబాగుపడేవాడ్నే మో.

నాకు చరిత్ర, రాజకీయాలు తెల్సు. కాని లెఖ్ఖలు తెలియవు. అణాపైసలు కూడుకొనడం, తీసివేయడం నాకు చికాకు. ఆ పని చేయడం నా తరం కాదు."

ఇంటికివచ్చి సావిత్రితో ఈ మాటే చెప్పాడు.

వ్యక్తిత్వాన్ని, అభిరుచుల్ని చంపుకొని మనం ఎందుకు బ్రతుకుతున్నట్టు సావిత్రీ ?"అని ప్రశ్నించాడు.

సావిత్రి మాట్లాడలేదు.

ఒక్కొక్కసారి అర్ధరాత్రి అంతా నిద్రపోతుండగా మురళి లేచి "సిగరెట్టు వుంటే బాగుండునే" అనుకొని అల్మారాలు, జేబులు, పెట్టెలు వెదుక్కొనేవాడు. పిల్లవాడికి బిస్కెట్లు కోసమని ఇల్లాలు దాచిన ఒక్క అణా కన్పిస్తే వందరూపాయలు దొరికినంత సంతోషం పొందేవాడు.

'అణాతో టీ త్రాగడమా ? సిగరెట్లు కొనుక్కొనడమా?' ప్రైవేటు పరీక్షలకు కూర్చొని మూడు యూనివర్శిటీ డిగ్రీలు పొందిన ఒక ప్రముఖ రచయితకు కన్నె సందేహం ! ఎవరూ ఊహించని సంఘటన !!

ఇక ఆ రాత్రి ఎన్నిపేజీలైనా వ్రాసి పారేసేవాడు. తెల్లవారిన తరువాత ఆ కాగితాల్ని సావిత్రి సర్దేది. వాటికి పేజీ నెంబర్లు వేసేది. 'చాలా బాగుంది' అనేది. 'ఇంకా ఇక్కడ ఇట్లా మారిస్తే బాగుండేదేమో' అంటుండేది.

అందుకు మురళి గర్వపడేవాడు.

"పాపం నువ్వు ఒక పేదవాడి భార్యవై ఎన్ని కష్టాలు

పడుతున్నావ్? ఒక్కొక్కసారి నా కథానాయికలు భోగ భాగ్యాలనుభవిస్తారు. సినిమాలు చూస్తారు. కార్లలో తిరుగుతారు. వాళ్ళతో నేనూ లీనమై పోతుంటాను. వాళ్ళు మత్తెక్కించే మందహాసం చేశారని రాస్తాను. అట్లా ఊహా ప్రపంచంలోకెళ్తాను. లేదా జాతీయ అంతర్జాతీయ రాజకీయ విషయాలపై క్షుణ్ణంగా, నిశితంగా వ్యాఖ్యలు చేస్తాను. నువ్వు ఇంట్లో ఈ పూటకు ప్రక్క ఇంటిలో నున్న వారిని బియ్యం అప్పు అడిగితే బాగుంటుందా లేదా అని తటపటాయిస్తుంటావు. పిల్లల ఆకలి చూడలేక, అభిమానం చంపుకొని రెండు డబ్బాల బియ్యం బదులు తీసుకుంటావ్. నువ్వు ఇవ్వలేవు..." మురళి నొచ్చుకుంటూ అనడం ఆమెకు చిత్రంగా వుండేది.

"మనకు మంచిరోజులు వస్తాయ్. మీరు నా గురించి బాధపడకండి. మనం బాధపడినా, అబ్బాయిలు అయినా ఫలానావారి పిల్లలని లోకం చెప్పుకుంటుంది. నన్ను మాత్రం మీ ఇంటికి వెళ్ళకూడదా అని విసిగించకండి. ఏరోజు పేపరు కట్టలు రాకపోయినా వ్యాపారం దెబ్బతింటుందని ఆయన ప్రాణం గిలగిలమని కొట్టుకుంటుంది. కాని నేను వచ్చానో వున్నానో వెళ్ళానో ఆయనకు అక్కరలేదు... అవమానాలకూ, నీచత్వానికి, సంకుచిత భావాలకు నేను అలవాటు పడలేను. అలాగే పేదరికానికికూడా నేను భయపడడం లేదు."

ఇక 'ప్రజామిత్ర' సంపాదకుని ఇల్లాలుగా సావిత్రి ఆ గ్రామం చేరుకుంది. వచ్చిన రోజునే చంద్రమౌళి మురళి

కుటుంబానికి కేటాయించిన ఇల్లు అంతా చూపించి కుశల ప్రశ్నలు వేస్తుండగా అక్కడకు విజయకుమారి వచ్చింది. "చెల్లాయ్. వీరే విజయకుమారిగారు" అంటూ ఇరువురికీ పరిచయం చేశాడు.

ఇద్దరూ ఆప్యాయంగా పలకరించుకున్నారు. కాని విజయ లోపలకు అడుగుపెట్టగానే మురళి కుటుంబ ఆర్థిక పరిస్థితి ఆమెకు బాగా అర్థమైపోయింది. ఇల్లంతా బోసిగావుంది. మనుషులుండడానికి కావలసిన సామాగ్రి లేకపోవడం ఆమెకు విచారం కల్గించింది

సావిత్రిని, పిల్లల్ని చూసి, కొద్దిసేపు పిచ్చాపాటీ మాట్లాడి విజయ వెళ్ళిపోయింది. అంతే. రెండురోజులనంతరం రెండుమంచాలు. రెండు పరుపులు, ఒకబీరువ, స్టెయిన్ లెస్ స్టీల్ సామాను, ఒక టేబిల్, మూడుకుర్చీలు, పిల్లలకూ, సావిత్రికీ, మురళికీ బట్టలూ దొంతరదొంతరులుగా వచ్చి పడ్డాయ్.

పత్రికా కార్యాలయం నుంచి ఇంట్లో అడుగు పెట్టబోయిన మురళి విస్తుపోయి 'చాలా పరధ్యానంగా రావడం వల్ల ఇంకొకరి ఇంట్లోకి వెళ్ళబోయినట్లున్నాను' అని నాలుక కరుచుకొని కాలు వెనక్కి వేశాడు.

అప్పుడే లోపలి నుంచి వచ్చిన పిల్లవాడు 'నాన్నా' అంటూ కాళ్ళను చుట్టుముట్టేసరికి మురళి మామూలు ప్రపంచంలోకి వచ్చి పడ్డాడు.

వారం రోజులు పోయిన తర్వాత మళ్ళీ చంద్రమౌళి వచ్చి చూశాడు. సావిత్రి శూలనొప్పితో బాధపడడం చూసిన చంద్రమౌళి మనస్సు చివుక్కుమంది.

వెంటనే పత్రికా కార్యాలయానికి వెళ్ళాడు. తల వంచుకొని బరబరా ఏదో వ్రాసుకుంటున్నప్పుడే "మురళీ" అన్నాడు బిగ్గరగా.

రెండస్థుల భవనం దద్దరిల్లింది.

అచ్చు యంత్రాలు తిరగడం ఆగిపోయినట్లయింది.

"నీకు బుద్ధి లేదురా? భార్య ఒక ప్రక్క అట్లా బాధ పడుతుంటే ఏమిటీ రాతలు? ఎవరికోసం నీ కలం చిందులు?" అన్నాడు.

"బాగా అడిగారు చంద్రమౌళి గారూ. తన ఇల్లు బాగుచేసుకోలేని వ్యక్తి దేశంకోసం పాటుపడతాడట!" అని పక పక నవ్వినట్లు టక్ టక్ మని ధ్వని చేసింది టెలిప్రింటర్.

"నా పిల్లలు, నా భార్య, నా సంతోషం అంటూ తాపత్రయం లేదు కాబట్టే ఈ పత్రికా ప్రపంచంలో పడ్డాను. ఈ దినపత్రికలో చేరాను, లేకపోతే నేను కూడా ఏదో వ్యాపారం చేసుకొని ఆస్థి సంపాదించుకొనేవాడ్నే..." అన్నాడు మెల్లగా.

చంద్రమౌళి ఆవేశం చల్లబడి పోయింది. దాంతో అతను కుర్చీలో కూలబడి పోయాడు.

"నీ ప్రజామిత్ర రోజుకు 60 వేల కాపీలు అమ్మేటట్లు చేయగల్గానని నువ్వు మురిసి పోతున్నావుకాని, నీ భార్య

ఆరోగ్యం దెబ్బతిని, ఆమె నీకు కాకుండా పోతే నువ్వు బ్రతకగలవా ?" అన్నాడు చంద్రమౌళి బెల్ నొక్కుతూ.

"సార్" అంటూ బోయ్ వచ్చాడు.

"రెండు కాఫీ తీసుకొనిరా" చంద్రమౌళి సిగరెట్టు ఒకటి మురళికి ఇచ్చి తను ఒకటి అంటించాడు.

"నిజమే." చాలా బాధగా అన్నాడు మురళి.

"మరి నువ్వు చేస్తున్న పని ఏమిటి ?"

"నువ్వు ఈ విషయం ప్రస్తావించావు కనుక ఇక అసలు విషయం దాచకుండా మాట్లాడుతాను. ఇంతకూ నాలాంటి వాడు పెళ్ళి చేసుకొనకుండా వుంటేనే హాయిగా వుండేది" అన్నాడు అగ్గిపుల్ల గీచి, సిగరెట్టు ముట్టిస్తూ.

చంద్రమౌళి గతుక్కుమన్నాడు. ఇలాంటి భావం అతనిలో చాలాకాలంనుంచి దాగి వుందనిపించింది.

"వారం రోజుల క్రితం మేము కోరకుండానే విజయ మా ఇంటికి వచ్చి మా కోసం చాలా ఖర్చు పెట్టి సామాగ్రి పంపారు. ఇప్పుడు మళ్ళీ వైద్యం కోసమని ఎట్లా ఇబ్బంది పెట్టగలను చెప్పు. ఆమెకు ఉబ్బసం వ్యాధి, పాపం ఆమె హృదయం ఎంత మంచిదైనా ఆమె ఆనందంగా వుండే క్షణాలు చాలా తక్కువే. విపరీతమైన దగ్గు, ఆయాసం, నీరసం రాయవెల్లూర్ వెళ్ళేగాని అది బాగుపడదు. నా దగ్గరున్న డబ్బు అంతా ఆమెకోసమే అయిపోయింది... ఏమిటో ఒక్కొక్కరి జీవితాలు ఇట్లా వుంటాయేమిటా అని అనిపిస్తుంటుంది..."

"అలాగని చేతులారా వినాశనాన్ని తెచ్చిపెట్టు కుంటావా ?" చంద్రమౌళి కోపంగా అడిగాడు.

"అయినా నాకు తెలియక అడుగుతాను. వైద్యం, వసతి, చదువు, తిండి, బట్ట ఇట్లా ఎంతమందికి విజయకుమారి ఇవ్వగల్గుతుంది ? ఇచ్చినా ఎంతకాలం ఇస్తుంది ? ప్రజల్లో చైతన్యం రావాలి. ఆర్థిక సమానత్వం తీసుకువచ్చే ప్రభుత్వం రావాలి. ప్రజల అవసరాలు అడగకుండానే చేసే ప్రభుత్వం మనం చూడాలి. నేను అదే ఈవేళ సంపాదకీయంలో రాయ బోతున్నాను..."

చంద్రమౌళి లేచాడు.

"కాఫీవస్తుంది. త్రాగి వెళ్ళు"

చంద్రమౌళి లేచి వడివడిగా వెళ్ళిపోయాడు.

అయిదు నిమిషాలు అయిందో లేదో వెనక్కి చంద్ర మౌళి వచ్చి "పోనీ ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకొనివెళ్ళాను. నేను దగ్గరుండి ఆమెను పరీక్ష చేయిస్తాను" అన్నాడు.

ఇంతలో బాయ్ కాఫీ పట్టుకొచ్చాడు.

"కాఫీ తీసుకో" అన్నాడు మురళి.

"అక్కడేముంది చంద్రమౌళీ ? అదంతా నరకం. పాపిష్టిసమూహం. కర్తవ్యం మరచిన నిర్దయ హృదయాలు. డబ్బుకోసం శవాల్ని పీక్కుతినే రాబందులు. వాళ్ళనిఅనికూడా లాభంలేదులే..."

చంద్రమౌళి బుర్రవేడెక్కిపోయి, లేచి వెళ్ళిపోయాడు. చల్లారిపోయిన కాఫీ త్రాగి మురళి వ్యాసం పూర్తిచేయడంలో మునిగిపోయాడు.

# 10

విజయ తలంటు పోసుకుంది. క్రొత్త గులాబీరంగు సిల్కు చీర కట్టుకుంది. తెల్లటి బ్లౌజ్ వేసుకుంది. రెండు సంవత్సరాల క్రితం ధరించిన రాళ్ళ నెక్లెస్ పెట్టెలో నుంచి పైకి తీసింది. తన మెడకు అందంగా వుందో లేదో చూసుకుంది. తమలపాకులు వేసుకోనడంలో ఎరుపెక్కిన పెదవులు 'అప్సరసలా వున్నావులే' అన్నాయ్.

'నిజంగానా?' అంది నిలువుటద్దానికి ఎదురుగా నిలబడి. రేడియో ట్యూన్ చేసింది. హిందీ ఫిల్మురికార్డులు మనస్సును మరింత ఉల్లాస పర్చాయ్.

మేడ మీది కిటికీ లోంచి వీధి వైపు చూసింది.

చంద్రమౌళి జాడ లేదు.

"అబ్బా! ఎప్పుడూ ఏదో ఆరాటం! ఏదో కొంప మునిగి పోతున్నట్టు!" అనుకుంది. తన చేతినున్న రిస్టువాచీ టైమ్ చూసింది. ఒంటి గంట అయింది. అటూ ఇటూ గదిలో పచార్లు చేసింది. ఏమీ తోచింది కాదు. ఒంటరి తనం వెక్కిరించింది.

టేబిల్ మీద నున్న పత్రిక తీసింది. స్ప్రింగ్ బెడ్ పై

కూర్చొని పేజీలు తిరగవేసింది. "కూర్చున్నారేం? కాస్సేపు ఒత్తిగిల పడుకోండి" అంది దిండుపై వున్న రామచిలుక. ప్రక్కనున్న మెత్తటి దిండు 'సుస్వాగతం' అంది. విజయ కిలకిల మని నవ్వింది.

బయట అడుగులు చప్పుడు అయింది.

విజయ లేచింది.

చంద్రమౌళి చాలా చికాకుగా లోపలికి వచ్చాడు. విజయ విస్తుపోతూ "అట్లా వున్నారేం? ఏం జర్గింది?" అంది.

సావిత్రి అనారోగ్యం గురించి చెప్పి "మురళి లోలోపల బాధపడుతున్నాడు. మిమ్మల్ని అడగలేక పోతున్నాడు. మీరు ఒక అయిదువందల రూపాయలు సహాయం చేస్తే ఆమెను రాయవెల్లూర్ ఆసుపత్రికి పంపించవచ్చు. ఈ సహాయం చేసిపెట్టండి."

"అట్లాగే చేద్దామండి" అంది విజయ.

"థాంక్స్" అని చంద్రమౌళి తన హేండ్ బ్యాగ్‌లో మాసిన బట్టలు సర్దాడు.

"ఎక్కడికి? ఇక భోజనం చేయరా!" అంది విజయ.

"నేను భోజనం చేయలేదా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఇది మరీ బాగుంది" అంటూ విజయ చేతిలో వున్న పత్రిక టేబిల్ మీదకు విసరి వేసింది.

"ఆకలిగా లేదండీ. పాపం మీరు నా కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారా!"

"నేనంత మూర్ఖురాల్ని కాదు" అంది కోపం పట్టలేక.

చంద్రమౌళి బిగ్గరగా నవ్వాడు.

విజయకు కూడా నవ్వొచ్చింది. కాని నవ్వును ఆపుకుంటూ లోనికి వెళ్ళిపోయి, కాఫీ పట్టుకొచ్చింది.

"పోనీ కాఫీ అయినా తీసుకుంటారా ?"

"థాంక్స్, ఇంతక్రితమే త్రాగాను"

"వద్దు, వద్దు మరి ఏంకావాలి ?

"విజయకుమారిగారూ. మీ అభిమానానికి చాలా కృతజ్ఞుణ్ని. నేను ఇప్పుడు రాజమండ్రి వెళ్ళాలి."

విజయకు కోపం ముంచుకొచ్చింది.

"వెళ్ళండి. ఇక్కడ మిమ్మల్ని ఆపేవారెవ్వరూ లేరు."

చంద్రమౌళి తెల్లబోయాడు,

ఆమె కళ్ళల్లోకి చూశాడు.

విజయ ముఖం త్రిప్పుకుంది.

"విజయా !" గుమ్మం ముందు నిలబడి సరళ గట్టిగా పిల్చింది.

"ఓ. నువ్వా ? రా. రా." విజయ ముందుకు అడుగువేసి ఆహ్వానించింది.

"అబ్బ ! ఎంత కాలానికి నిన్ను చూశానే విజయా ! ఏమబ్బా ! ఉత్తరాలు రాయడానికే తీరుబడిలేదా ?" అంది సరళ జేబురుమాలుతో చెమట బిందువుల్ని తుడుచుకుంటూ.

"ఏమిటో అశ్రద్ధ. అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం కాని వీర్ని పరిచయం చేస్తాను. ఇలారా" అంటూ బుద్ధ

భగవానుడిలా కూర్చున్న చంద్రమౌళి దగ్గరకు సరళను తీసుకొచ్చింది. పరిచయం చేసింది.

"నమస్కారమండీ"

"నమస్కారం"

"వీరి గురించి నాకు ఇంతకు ముందు తెల్సు" అంది సరళ సంతోషం ఉట్టి పడేలా.

"ఇంతకు ముందెలా తెల్సు ?" విజయ ఆశ్చర్యంగా అడిగింది,

"ఒకసారి కాకినాడలో వీరి ఉపన్యాసం విన్నాను. ఆ ఉపన్యాసం ఇప్పటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తుంది" అంది సరళ కుర్చీలో కూర్చుంటూ.

చంద్రమౌళి మందహాసం చేశాడు.

విజయ ఫ్లాస్కులోనుంచి కాఫీ కప్పుల్లో పోసింది.

ముగ్గురూ త్రాగారు.

"వస్తానండీ. శెలవు" అంటూ చంద్రమౌళి వెళ్ళిపోయాడు. విజయ హృదయం గిల గిల మని కొట్టుకుంది. ముఖం నల్లబడిపోయింది. సరళ ఎక్కడ కనిపెడుతుందో అని ఆమార్పునుంచి తేరుకొనడానికి విశ్వప్రయత్నాలుచేసింది.

"ఇప్పుడు ఏం చేస్తున్నావ్ సరళా ?"

"ఏలూరు సెంటు థెరెసా కళాశాలలో లెక్చరర్‌గా చేరానని నీకు ఉత్తరం రాశానుగా !"

"అబ్బే, ఆ ఉత్తరం నాకు అందలేదే !" అంది విజయ,

"అంతేలే విజయా. కొన్ని కొన్ని విషయాలను మనం తెల్సివుండి కూడా ఒప్పుకోలేం" అంది సరళ.

"అబ్బ! నీ ధోరణి నీదేగాని నన్ను నమ్మవ్" అంది విజయ లోలోపల చంద్రమౌళి ప్రవర్తన గురించి ఆలోచిస్తూ.

"నేను ప్రయాణంలో బాగా అలసట చెందాను. ముందు స్నానం చేయనా?" అంది సరళ.

"అట్లాగే" అంటూ విజయ పనిమనిషిని పిల్చి వేడినీళ్ళు పెట్టమంది.

"వద్దు. చన్నీళ్ళ స్నానం చేస్తాను. కాని విజయా! వీరు నీకు ఎట్లా పరిచయం అయ్యారు? ఈయన ఉపన్యాసం ఎప్పుడైనా విన్నావా?"

"ఏం అంత బాగుంటుందా?"

"అదేం ప్రశ్న? ఈయన ఉపన్యాసం అంటే ఇసుక వేస్తే రాలనంత జనం వస్తారు. వచ్చినా చీమ చిటుక్కుమంటే విన్పించే అంత నిశ్శబ్దం. అబ్బ! ఎంత ఆవేశం? ఎంత వేడి? ఆ విమర్శలో ఎంత వాదనా చాతుర్యం! ఆ వాగ్ధాటి ఒక మహా ప్రవాహం లాంటిది. ఆ ప్రవాహంలో మనం కూడా కొట్టుకొని పోతామేమో అనిపిస్తుంది. వివిధరకాల మనుషుల్ని గంటల తరబడి తన మాటల్తో కూర్చోబెట్టడం మాటలా? అసలు ఆంధ్రదేశంలో అనర్గళంగా అద్భుతంగా మాట్లాడే వక్తలు ఎంతమంది ఉన్నారంటావ్?"

విజయ మాట్లాడలేదు.

సరళ స్నానం చేయడానికి లోపలికి వెళ్లింది.

చంద్రమౌళి వెళ్ళే ముందు తన దగ్గర డబ్బు వుందో లేదో చూసుకున్నాడో లేదో అని విజయ బాధ పడింది. తనని అడిగేవాడేమో కాని ఇంతలో సరళ వచ్చి పడింది.

తను అయినా ఆ మాటల సందర్భంలో ప్రస్తావించి వుండవలసింది. తను ఇవ్వక పోవడం ఎంత పొరపాటు అయింది? డబ్బు లేకుండా ఎక్కడికి వెళ్తారు? వెళ్ళినా ఏం చేస్తారు? ఎన్నాళ్లుంటారు? ఎక్కడుంటారు? తిండి, నిద్ర ఈ వ్యక్తికి అవసరం లేదా? ఆ ఖద్దరు బట్టలు ఏమిటి? ఆ సంచిలో ఎన్ని బట్టలున్నాయ్? అవి అయినా అన్నీ పట్టుకెళ్ళినట్లా?

ఇట్లా వేదనతో కూడిన ప్రశ్నలు ఆమె బుర్రను వేడెక్కించి వేశాయ్. ఇంతలో మురళి భార్య అనారోగ్యం గురించి గుర్తొచ్చింది. గుమస్తాను పిల్చి అయిదువందల రూపాయలు వెంటనే మురళికి ఇచ్చి రమ్మంది. వాళ్లు వెంటనే ప్రయాణం అయ్యేటట్లు కూడా చూడమంది. గుమస్తా ఏదో చెప్పబోయేసరికి సరళ నవ్వుతూ వచ్చి "నేను ఏలూరులో ఉద్యోగం చేస్తానని అనుకోలేను సుమా" అంది.

గుమస్తా వెళ్ళిపోయాడు.

"ఏం బాగా వుందా?" అంది విజయ.

"మా కాలేజిలో మనవాళ్ళు తక్కువగా అధ్యాపకులున్నారు. ఎక్కువగా మళయాళీ స్త్రీలు వున్నారు. వాళ్ళ కట్టు, బొట్టు, విధానం ఎలా వున్నా, వాళ్ళ తెగింపు చూస్తే మనం సిగ్గు పడాలి" అంది సరళ తిలకం బొట్టు పెట్టుకుంటూ,

"ఎందుకని ?"

"ఎక్కడ కేరళ దేశం ? ఎక్కడ ఏలూరు ? అయినా వాళ్ళు ఇంత దూరం ఒంటరిగా వుద్యోగం చేయడానికి ఎంత నిర్భయంగా వచ్చారో చూడు. మన స్త్రీలు మొగవారు తోడు లేందే కనీసం రైలుగాని, బస్సుగాని ఎక్కలేరు! ఎక్కినా ఒక్కటే గోల. దరిద్రగోల. వాళ్ళు ప్రతి రంగంలోనూ ముందుకు వస్తున్నారు.

మనం పాత భావాలతో, 'స్త్రీలు ఉద్యోగాలు చేయాలా? ఊళ్ళు ఏలాలా?' అంటూ మూతి ముడుస్తున్నాం. కాని విజయా, ముందు దేశం బాగుపడాలంటే స్త్రీలలో మార్పు రావాలంటాను. స్త్రీ అజ్ఞాతంగా, అజ్ఞానంగా వున్నంత వరకూ సమాజంలో వికాసం కన్పించదు. స్త్రీకి శీలం ఒక్కటే ప్రధానం కాదు. అట్టడుగున పడివున్న భారత స్త్రీ ప్రతి రంగంలోనూ ముందుకు రావాలంటాను. ఏమంటావ్!" అంది సరళ ఫ్యాన్ వేస్తూ.

"అదెట్లా సాధ్యమవుతుంది ?"

"ఇదిగో చంద్రమౌళి లాంటి వందలాది వ్యక్తులు, 'ప్రజామిత్ర' లాంటి దినపత్రికలు పూనుకుంటే అవుతుంది. ఆయన గురించి ఆ మధ్య ఆంధ్ర పత్రికలో ఒక వ్యాసం పడింది చూశావా ?"

"ఏం రాశారు ?" అంది విజయ ఉత్సాహం ఆపుకోలేక.

"సరేలే. నువ్వు పత్రికలు కూడా చదవడం లేదన్న మాట! సుప్రసిద్ధ దేశభక్తుడని, సమతా వాది అని, సహృదయుడని ఆయన జీవిత చరిత్ర చక్కగా రాశారు. ఇంతకూ ఒక రైతు కుటుంబంలో పుట్టిన ఒక సామాన్య రైతు బిడ్డకు, ఏమీ చదువుకోని ఒక పల్లెటూరి యువకునికి ఇంత చరిత్ర వుందా అనిపించింది. నేను అందుకే ఆయన ఉపన్యాసాల్ని పత్రికల్లో తప్పకుండా చదువుతుంటాను."

"మాటలకూ చేతలకూ చాలా తేడా వుంటుందని అనుకోలేదా సరళా?"

"అతని కళ్ళల్లోకి నువ్వు పరీక్షగా చూడలేదేమో. ఇంత నిజాయితీ పరుడ్ని, నిర్మొగమాటస్తుడ్ని మనం ఎక్కడో కాని చూడమని ఆయన్ని తెల్సినవాళ్ళు అంటుంటారు. కానీ..."

"ఆపు జేసేవేం? చెప్పు" అంది విజయ ఆత్రుత పట్టలేక.

"ఆయనకు వ్యక్తిగతంగా పలుకుబడి వుంది కాని పార్టీకి బలం లేదు. అందుకని ఆయన గొప్పవాడవడానికి అవకాశాలు లేవు" అంది సరళ.

అంతవరకూ శ్రద్ధగా విన్న విజయకు విపరీతమైన కోపం ముంచుకొచ్చింది. క్షణంలో మళ్ళీ తమాయించుకుంది.

"పోనిద్దూ, మనకెందుకు పార్టీ రాజకీయాలు? ఈవేళ ఆదివారమని వచ్చావా? ఒక్క నెల రోజులు శెలవుపెట్టి ఇక్కడ వుండకూడదూ?" అంది విజయ.

సరళ పకపకమని నవ్వింది.

"నీ టక్కరి నవ్వు నాదగ్గరకాదు. వేళగాని వేళ వచ్చావ్. ఉండు ఏదైనా టిఫిన్ చేయిస్తాను." అంటూ విజయ లోపలికి వెళ్ళింది.

# 11

చపాతీ తింటూ "విజయా. ఇంతకూ నేను ఎందుకు వచ్చానో నీకు చెప్పలేదు" అంది సరళ.

"నన్ను చూడడానికి" అంది విజయ నవ్వుతూ.

"అది సరే. మా నాన్నగార్ని నువ్వు చూడలేదు కాని ఆయన మాట ఆయనదే. నా పెళ్ళి ఇక వాయిదా వేయడానికి వీలులేదని పట్టుబట్టారు. అమ్మకూడా ఈ సంబంధం పోగొట్టుకోనడానికి వీలులేదంది. నేను ఒప్పుకున్నాను. విజయా".

"అయితే ఇంతకు వరుడెవరు ?"

"ఆయన్ని నువ్వుకూడా ఒకసారి చూశావ్. ఆయన పేరు ......" అని ఆగిపోయింది.

"అబ్బ! నన్ను సస్పెన్స్‌లో పడేసి చంపకు." అంది విజయ.

"మా వేణు. మేనరికం. కట్నం కానుకల బాధలేదని అమ్మ ఆత్మ సంతృప్తి. ఇప్పుడు మా బావ విజయనగరం గవర్నమెంట్ హాస్పిటల్‌లో అసిస్టెంట్ సర్జన్‌గా పని చేస్తున్నాడు."

"అమ్మ దొంగా. ఈ రహస్యం నాకు ఎప్పుడూ చెప్ప లేదేం ?"

సరళ నవ్వుతూ "ఇది మా మధ్య తేలని సమస్యగా వుండిపోయింది. చివరకు ఇద్దరం ఒప్పుకున్నాం" అంది.

"ముహూర్తం నిర్ణయించారా ?"

"రేపు 19 వ తేదీన పెళ్ళి. నువ్వు తప్పకుండా రావాలి. నిన్ను పిలవడానికే వచ్చాను" అంటూ తన బేగ్‌లో వున్న శుభలేఖ అందించింది.

"నువ్వు దొంగవు, నేను రాను" అంది విజయ.

"నువ్వు రాకపోతే నేను ఊరుకోనుగా."

"ఏం చేస్తావ్ ?"

"నీ పెళ్ళికి నేను రాను" అంది సరళ కాఫీకప్పు ప్రక్కకు పెడుతూ.

"అదా నీ ధీమా? అయినా నేను పెళ్ళి చేసుకుంటేగా?"

"విజయా. నీలాగే ఈ నాటి ఆధునిక యువతి ప్రారంభంలో ఏదో అనుకుంటుంది. కాని ఈ నాగరికత, ఈ సంస్కారం, ఈ పుస్తకాలు, సినీమాలు, ఇరుగు పొరుగు, మొగవారు మనల్ని కవ్వించి వదలి పెట్టకపోవడం ముమ్మాటికీ ఖాయం. అయినా నువ్వు ఏమైనా వ్రతం పట్టావా ? లేదా తపస్సు చేస్తున్నావా? చేస్తే ఎవరి కోసం ? ఎందుకోసం ?"

విజయ ఫక్కున నవ్వింది.

# 12

విజయ చాలా కాలానికి ఊరు విడిచి బయలుదేరింది. విశాఖపట్నంలో అడుగు పెట్టగానే అనేక అనుభవాలు, జ్ఞాపకాలు ఆమె కళ్ళముందు తిరుగాడాయ్. తను ఇంచుమించు రెండు సంవత్సరాలు అక్కడనే చదువుకుంది. ఆ భవనాలు, వీధులు, రోడ్లు, సముద్రపుగాలి ఎంతో తృప్తిని కల్గించాయ్.

సరళ పెండ్లి సందర్భంలో చాలామంది విజయను చుట్టుముట్టారు. చాలా కాలానికి కలుసుకున్నామన్న సంతోషంలో పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

విజయకు పెద్దపెద్ద అధికారుల్ని, వ్యాపారస్థుల్ని, విద్యావేత్తల్ని, నాయకుల్ని సరళ తండ్రి పరిచయం చేశాడు. డబ్బు ఇంత పనిచేస్తుంది కదా అని విజయకు అనిపించింది.

సరళ పెండ్లి ఘనంగా జర్గింది. ఆ వేడుక విజయలో చిత్రవిచిత్రమైన భావాలు కల్గించాయ్. అందరూ ఏదో ఒక విధంగా జీవితంలో స్థిరపడిపోయారు.

ఎవరి హృదయాల్లో ఏముందోగాని హాయిగా జీవిస్తున్నట్లే మాట్లాడారు.

"నువ్వు ఇంకా పెళ్ళి చేసుకోవా ?" అని విజయను సన్నిహితమైన కొద్దిమంది అడిగారు.

విజయ నవ్వింది. అది బాధాపూరితమైన నవ్వు అని సరళ భర్త వేణు గ్రహించాడు.

వేణు చదువుకొనే రోజుల్లోనే చాలా తెలివైన

వాడని, క్లాసులో తెచ్చుకున్న మార్కులని చూసి అనేక మంది అన్నారు. జీవితంలో కూడా చాలా ఘటికుడని అతని మిత్రులు అన్నారు.

వైద్యశాస్త్రంలో డిగ్రీపొందిన కొద్దికాలానికే అతనికి ప్రభుత్వ ఉద్యోగం వచ్చింది. అతనికున్న పలుకుబడి ఉపయోగించి మొదట్లో అనకాపల్లి మార్పించుకున్నాడు.

ఆ తర్వాత విజయనగరం చేరుకున్నాడు. అతను మనిషిలోని రోగం ఎంతో చక్కగా గుర్తించి, వైద్యం చేయగలడని మంచి పేరు తెచ్చుకున్నాడు. కాస్తో కూస్తో కొద్ది కాలంలోనే డబ్బు సంపాదించాడు.

ఆలస్యంగా పెళ్ళి చేసుకోనష్టమే ఆరోగ్యమని పైకి అనేవాడు కాని అతని శీలం అంత మంచిదికాదని సరళకు అనుమానం.

ఆ అనుమానం చాలకాలం వరకు సరళను ఒక నిర్ణయానికి రాకుండా అడ్డుపడింది. చివరకు పెండ్లిపీటలమీద కూర్చుంది. ఇంతకూ కలకలలాడే ఆ పెండ్లి పందిరలో తనని ముఖ్యంగా పెండ్లికొడుకు కళ్ళు వెంటాడటం విజయకు అసహ్యం కల్గింది. ఇంకా రెండు రోజులు వుందామనుకున్న విజయ వెంటనే బయలు దేరింది.

## 13

లోపలకు అడుగు పెట్టేసరికి కుర్చీలో కూర్చొని చంద్రమౌళి పేపరు చదువుకుంటూ కన్పించాడు.

'ఏం మళ్ళీ ఎందు కొచ్చారు ?' అని అడగాలనుకుంది. కాని ఆ మాటలు బైటికి రాలేమన్నాయ్.

"ఓ ! మీరా ? ఎప్పు డొచ్చారు ?"

"నిన్న సాయింకాలం"

"మీకు ఏమీ ఇబ్బంది కలగలేదు కదా !" అంటూ విజయ లోపలికి వెళ్ళబోయింది.

"చంద్రమౌళి రోజుకు పదిసార్లు అయినా కాఫీ త్రాగుతాడు. భోజనం లేకపోయినా కనీసం సిగరెట్లు వున్నా ఫర్వాలేదు. ఈ సంగతి అతని మిత్రులకు ముఖ్యంగా విజయ కుమారి గారికి బాగా తెల్సు" అన్నాడు పేపరులో తలపెట్టి. ఆ మాటలకు ప్రయాణ బడలిక ఎగిరిపోయి, విజయ హృదయం సంగీతం పాడుకుంది.

ఒక గంట సేపటికి స్నానంచేసి, క్రొత్తబట్టలు ధరించి అతనికి ఎదురుగా వచ్చిన సౌందర్య దేవతను చూశాడు. ఆ సౌకుమార్యం, ఆ సౌజన్యం చూసి క్షణం సేపు చలించి పోయాడు.

'ఈ మెరపు తీగ ఎవరి కౌగటిలోకి వెళ్తుందో కాని... ఈమె మంచితనాన్ని, ఉదార స్వభావాన్ని అర్థం చేసుకొని హర్షించ గల భర్త దొరికితే ఎంత బాగుండును !' అనుకున్నాడు.

"తర్వాత ఆలోచించవచ్చుగాని ... ముందు కాఫీ తీసుకోండి" అంది ఆ సౌదామని.

అతను కాఫీ త్రాగాడు.

"ఇన్నాళ్ళూ ఏం చేశారు?" అంది కుర్చీలో కూర్చుంటూ.

"ఒక పెళ్ళి చేయించాను."

ఆమెకు సిగ్గు వేసింది.

ఒయ్యారంగా "వేళాకోళం చేస్తున్నారా?" అన్నట్లు చూసింది.

"పరిహాసంగా అనడం లేదు విజయకుమారిగారూ. రాజమండ్రిలో నాకు ఒక స్నేహితుడున్నాడు. అతనికి పెళ్ళి అవుతుందని ఎవ్వరూ అనుకోలేదు. అతను ఎందుకు పనికి రాడని ఏకగ్రీవంగా తీర్మానించారు. కాని అతను తెలివైన వాడు. అయితే ఆ తెలివి తేటలు సద్వినియోగం చేసుకోకుండా అతను చాలా అల్లర చిల్లరగా తిరిగేవాడు.

నాకు తెల్సిన దూరబంధువుల్లో చిన్నతనంలోనే భర్త పోగొట్టుకున్న ఒక వితంతువు వుంది. ఆమె ఎంతో అందంగా వుంటుంది. చాలా ఉత్తమురాలు. అయితే ఆమెలో మొదటి సారిగా నేను ఈ భావం కల్గించినప్పుడు నన్ను అనుమానించింది, చీదరించుకుంది.

"తల్లిదండ్రులున్నంతవరకూ బాగానే చూస్తారమ్మా. తర్వాత నీ గతి ఏమిటి?" అని ప్రశ్నించాను. ఆమె ఆలోచనలో పడింది. ఆమె పెద్దన్నయ్యతో మాట్లాడాను. అతను కూడా ఒప్పుకున్నాడు. ఇంట్లో అందరికీ నచ్చచెప్పాడు. మొన్న రాజమండ్రిలో పెళ్ళి చేశాం. జీవితంలో డబ్బులేక పోవడమే నీరసానికి కారణం. ఇప్పుడు నామిత్రుని చేతికి పదివేల

రూపాయలు వచ్చాయ్. ఇక అతనికి జీవితంలో భయపడవలసిన పనిలేదు. చక్కగా పొలం కొనుక్కొని వ్యవసాయం చేసుకో మన్నాను."

"మరి దేశదిమ్మరిగా తిరిగే మీ స్నేహితుడు ఆ డబ్బు పాడుచేస్తే ఆమె భవిష్యత్ ఏం కాను?" అంది విజయ రేడియో ట్యూన్ చేస్తూ.

"నేను ముందుగానే అతని ఇల్లాలుకు చెప్పిందే, మీ కుటుంబం బాగుపడినా, నాశనమైనా అంతా నీ చేతుల్లో వుందని గట్టిగా చెప్పాను. అయినా పెళ్ళి అయింది కనుక ఇక అతని కాళ్ళకు బంధాలు ఏర్పడ్డాయ్ లెండి..." అన్నాడు నవ్వుతూ.

"నన్ను కూడా పిలిస్తే వచ్చే దాన్నిగా" అంది విజయ.

"ఎవరో మీ కోసం వచ్చారండీ" అంటూ కుర్రవాడు వచ్చి చెప్పాడు.

"అబ్బబ్బ! ఈ డబ్బున్నవాళ్ళకు సుఖం వుండదు. కాస్సేపు కులాసాగా మాట్లాడుకోనివ్వరు" అంది విజయ.

క్షణం ఆగి 'రమ్మను' అంది.

50 ఏళ్ళ వయస్సుగల వ్యక్తి లోపలికి వచ్చాడు. నల్లగా, నడవడానికే కష్టపడుతున్నట్లున్నాడు.

"నమస్కారమండీ"

"నమస్కారం, అట్లా కూర్చోండి" అంది విజయ.

"మొన్న మీ ప్రజామిత్ర పత్రికా కార్యాలయానికి వేరేపనిమీద వెళ్ళాను. మీ సంపాదకులు మురళిగారితో

నాకు బాగ పరిచయంవుంది. మాటల సందర్భంలో మీ గురించి చెప్పారు. మిమ్మల్ని ఒకసారి కల్సుకోమన్నారు." అని ఆగిపోయాడు శెట్టి.

"దేనికండీ?" అంది అసహనం ఆపుకొంటూ.

"మీరు చాలా దానాలు చేస్తున్నారని విన్నాను..."

"నేను ఇప్పుడు ఒక్క-కానీ విరాళం ఇచ్చే పరిస్థితిలో లేను" అంటూ విజయ కుర్చీలోంచి లేచిపోయింది.

"అమ్మా, నేను చెప్పేది కొంచెం వినండి. నేను మీ దగ్గరకు విరాళంకోసం రాలేదు. అప్పుకోసమూ రాలేదు. డబ్బు దోచుకుందామని అంతకంటే కాదు. ఇట్లా మీకు ఉన్న దంతా హారతి కర్పూరంలా అయిపోతే తర్వాత మీరు చేసే దేమిటో కొంచెం ఆలోచించండి."

ఎవరు తన దగ్గరకు వచ్చినా సంతర్పణలని, ఉత్సవాలు చేస్తున్నామని, గుళ్ళు, గోపురాలు కట్టిస్తున్నామని ఇట్లా ఏదో చెప్పడం, ఆమె ఇవ్వడం మామూలుగా జరిగే విషయాలు కాని ఆ శెట్టి మాటలు విజయను నిలబెట్టాయ్.

"అయితే మీరు ఎందుకొచ్చినట్లు?" అంది.

"నిజం చెప్పాలంటే నేను విజయవాడలో ఒకనాడు పెద్ద వ్యాపారస్థుణ్ని. అయినా రెండుసార్లు దివాలా తీశాను. కాని అది నా తెలివి తక్కు-వతనం కాదు. వ్యాపారంలో అనుకోకుండా మార్కెట్ ధర పడిపోవడంతో మా కొంప కూలింది. నాకు కనుక ధనం వుంటే బ్రహ్మాండమైన

వ్యాపారంచేసి లాభాలు గడించేవాణ్ణి. ఇనంతా మీతో మాట్లాడుదామని వచ్చాను. మీరు ఇట్లా దాన ధర్మాలు చేసుకుంటూ వెళ్తే మీ ధనం ఎంత కాలం వస్తుంది? కనుక ఏదో రాబడి వుండాలి. అందుకు వ్యాపారం ఒక సాధనం. మీరు పెట్టుబడి పెట్టండి. అంతా నేను చూస్తాను. కాని నేను మాత్రం జీతానికి మాత్రం మీ దగ్గర పని చేయను. నాకు లాభంలో కొంత వాటా యివ్వాలి మీకు ఇష్టమేనా? లేదా నాకు కొద్దిగా పెట్టుబడి పెట్టండి. మీ ఊర్లోనే వుంటాను. కొంచెం కొంచెంగా అప్పు తీర్చుకుంటాను. నేను పారిపోతానని, మీ డబ్బు తినేస్తానని మీరు భయపడనవసరం లేదు. మంచి వ్యాపారస్థుడు పరపతి నిలబెట్టుకోవడానికే చూస్తాడు" అన్నాడు శెట్టి.

విజయ చంద్రమూళి వైపు తిగ్గి "మాట్లాడ రేమండీ?" అన్నట్లు చూసింది.

"ఏమి వ్యాపారం చేద్దామంటావు? ఎంత పెట్టుబడి కావాలి?" అన్నాడు చంద్రమూళి.

"సుగంధద్రవ్యములు వ్యాపారంచేస్తే చాలా బాగుంటుం దని నా ఉద్దేశ్యముండి. ఇది గృహపరిశ్రమలాంటిది. ఇలాంటి చిన్నతరహా పరిశ్రమలకు ప్రభుత్వంకూడా బాగా సహాయపడు తుంది. దీన్ని మనం బాగా అభివృద్ధి చేసుకోవచ్చు. ఇతర దేశాలకు మనం మన సరుకుల్ని ఎగుమతికూడా చేయొచ్చు. మీ పేరుమీదుగా వ్యాపారం చేయడానికి నాకు అభ్యంతరం లేదు."

"అంటే దాంట్లో ఏమితయారు చేస్తారు?" అందివిజయ.

"అత్తర్లు, అగరువత్తులు, కర్పూరబిళ్ళలు, చందనపు సబ్బులు, తలనూనెలు, వ్యాజ్‌లైన్లు, పౌడర్లు, యూకలిప్టస్ ఆయిల్, పండ్లపొడి మొదలైనవి తయారుచేస్తాం. పూజలకు, కేశలావణ్యానికి, శరీరపోషణకు, నొప్పులకు పనికివచ్చే ఇలాంటి సరుకులు ప్రజలకు నిత్యంకావాలి. మనం చౌకలో నాణ్యమైన సరుకు తయారుచేద్దాం. దానివల్ల అనేకమందికి ఉపాధికల్పించవచ్చు. మనపేరు చెప్పుకొని కొంతమంది అయినా పొట్ట పోసుకుంటారు. ఇందులో పనిచేసేవారికి చదువు సంధ్య లక్కర లేదు. ఆడవాళ్ళకుకూడా ఏదో జీవనోపాధి చూపినవాళ్ళ మవుతాం"

పరిమళంలాంటి ఆమాటలు విజయకు ఎంతో హాయిని గొల్పాయ్.

"బాగానేవుంది. ఇందులో లాభాల మాటేమిటి?" అన్నాడు చంద్రమౌళి.

"ఇక్కడే మీ ఊర్లోనే ఈ పరిశ్రమను స్థాపించుదాం. మీరు లెఖ్ఖలు చూసుకుంటూఉండొచ్చు. నేను అజమాయిషీ చేస్తాను. పావలా వాటామాత్రం నాకు యివ్వాలి. కాని మీరు మొత్తం లాభాల్లోంచి మీ ఇష్టం వచ్చినట్లుగా డబ్బు దానం చేస్తే నేనుఅంగీకరించను. మీ లాభం మీరుతీసుకొని, అప్పుడు ఆ డబ్బుని మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. నా డబ్బు నాదే."

విజయా, చంద్రమౌళి ఫకాలున నవ్వారు.

"అవునండీ. ఉన్నమాట ముందు అనుకుంటే మంచిది. తర్వాత నిష్ఠూరాలు దేనికి? నాకు డబ్బు ఆశ లేకపోతే ఇంత దూరం రావడం దేనికి? ఈ శ్రమ దేనికి చెప్పండి?"

"మీకూ, మీ కుటుంబానికి నెలకు ఎంత కావాలంటారు?" అన్నాడు చంద్రమౌళి.

"ఏమండోయ్. ఎంత కావాలంటే ఏం చెప్పను? ఒకసారి పెద్ద మేడలో వున్న వాళ్ళం. అప్పటి రోజులవి. ఇప్పుడు అద్దె కొంపలో అఘోరిస్తున్నాం. ఏం చేస్తాం? అయినా జీవితానికి భద్రత వుంటుందో లేదో అనే కదా డబ్బు దాచుకోవడం" అన్నాడు శెట్టి.

"తర్వాత మాట్లాడుకుందాం. మీ రిద్దరూ భోజనానికి లేవండి" అంది విజయ లోపలకు వెళ్తూ.

# 14

"విజయా!" "విజయా!" అంటూ భవనం దద్దరిల్లేటట్లు మేనమామ పిలిచాడు.

పుస్తకం చదువుతున్న విజయ ఒక్కసారిగా ఆ కేకలకు త్రుళ్ళిపడింది. "ఏం మామయ్యా" అంది విజయ మంచం మీదనుంచి లేచి గుమ్మంవైపు నడుస్తూ.

"రోజు రోజుకూ నీ బుర్ర ఇట్లా పనిచేస్తోందేం విజయా! మేమంతా చచ్చిపోయామనుకున్నావా? నీవు ఆస్తికి ఎంత వారసురాలవైనా మాతో కనీసం సంప్రదించనవసరం లేదను

కుంటున్నావా? ఏది చూసుకొని నువ్వు గాలిమేడల్లో కూర్చున్నావో అది కాస్తా కూలిపోవడంతో జీవితాంతం కుమిలి కుమిలి ఏడుస్తావ్, నీకు ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు."

విజయకు చికాకు వేసింది.

"ఇప్పుడేం జరిగింది?" అంది కోపంగా.

"అంతే. ఏమైనా చెబుదామంటే ముఖం చిట్లించుకుంటావ్. ఏం జరుగుతోందో నీకు ఏమీ తెలియదా?"

"అబ్బ! ఏమిటో చెప్పకూడదా?"

"ఆ చంద్రమౌళి ఎక్కడ?"

"శెట్టిగారితో కలిసి మద్రాసు వెళ్ళారు."

"ఎందుకు?" మేనమామ మీసాలు కోపంగా ప్రశ్నించాయ్.

"అగరువత్తుల కంపెనీ పెడుతున్నాం. దానిసామాగ్రి కోసం."

"సామాగ్రీ వాడిశ్రాద్ధం. వాడు నీపాలిట శనిగాడు. వాడు నీ కొంప గుల్లచేసి, నిన్ను నలుగురిమధ్యా అప్రతిష్ఠపాలుచేసి, నువ్వు ఏడుస్తుంటే అప్పుడు......"

"మామయ్యా, ఇక ఇలాంటి మాటలు అనవసరం. నా ఆస్థిని నా ఇష్టంవచ్చినట్లు చేసుకుంటాను. ఎవరి అభిప్రాయాలు వారివి. నువ్వు ఇందులో జోక్యంకలగజేసుకోనడం అనవసరం. నువ్వు ఏం చెప్పినా వృథాప్రయాస. అంతే" అంది చాలా తీవ్రంగా విజయ.

"ఔను వృథా కంఠశోష అని తెల్సు. అమ్మకనుక బ్రతికివుంటే నేను మాట్లాడవలసిన పని వుండేదికాదు..."అని గిర్రునతిగ్గి మేడ మెట్లు దిగి వెళ్ళిపోయాడు.

ఇంత ఆస్తివున్నా, సుఖం, శాంతి లేకపోయాయని విజయ బాధపడింది. తనని బంధిఖానాలో పెట్టి ఎందుకు బాధించాలని చూస్తారో ఆమెకు అర్థం కాలేదు. తనదగ్గర డబ్బు వున్నంతవరకూ ఇట్లా జనం పీడించితీరుతారనుకుంది. ఒక ప్రక్క మేనమామ, మరోప్రక్క అత్తయ్య, మరోవైపు చిన్నాన్న తనని నానామాటలు అనడం ఆమెను ఎంతో కలత పెట్టాయి.

ఎక్కడికైనా పారిపోదామా అనుకుంది. పారిపోతే తనగురించి ప్రజలు రకరకాలుగా చెప్పుకుంటారు. తనగురించి అనుకున్నా బాధలేదు కాని, అనవసరంగా చంద్రమౌళిని అనుమానించి, అవమానించడం ఆమె ఊహించలేననుకుంది.

ఒక్క డబ్బు పోతోందని మాత్రమేనా వీళ్ళబాధ ? లేదా తమ ఇద్దరికీ అక్రమ సంబంధం వుందని ఏసుస్తున్నారా? అందరూ అంతే అనుకుంటే ఎంత ఘోరం ? అనుకుంది.

ఇంతకూ ఇదంతా చంద్రమౌళికి తెలుసా? ఆ నోటా ఆ నోటా అతనికి తెలియదా? తెల్సి ఎంతో నిగ్రహం కనపరుస్తున్నాడా! తనని అనుమానిస్తున్నారని తెలిస్తే ఇక్కడకు చంద్రమౌళి ఎందుకు రావాలి? వస్తే తనకు కల్గుతున్న లాభంఏమిటి? తనకూ చంద్రమౌళికీ స్నేహం ప్రారంభమై రెండు సంవత్సరాలైంది. అతను సంపాదించిందేముంది ?

కొన్నాళ్ళు ఇక్కడ తృప్తిగా తిన్నాడు. కొంతకాలం హాయిగా జీవించాడు. అంతేనా? అలాంటి సుఖప్రదమైన జీవితం అతను కోరుకుంటున్నాడా? ఈ గుస గుసల మధ్య, ఘర్షణల మధ్యనుంచి తప్పుకుంటే అతను నష్టపోయే దేమిటి?

తన దగ్గర నుంచి పాపం ఏమీ డబ్బు తీసుకోలేదే? 'ప్రజామిత్ర' పత్రికలో పనిచేసే వారిలా జీతాలు అడగలేదే? శెట్టిగారిలా లాభాలు పంచిపెట్టమని కోరలేదే?

పది మంది సుఖంగా వుండాలని పది సభల్లో ప్రసంగిస్తాడు. మనిషిలో ఎంత ఆవేశం వుందో అంత వివేకం వుంది కదా! ఎంత వివేకం వుందో అంత కార్యనిపుణత వున్నవాడు కదా!

ఏమి చేసినా నాన్న కోసం, నా కోసం, ప్రజలకోసం గ్రామపురోభివృద్ధికోసం కృషి చేస్తున్నాడే!

అతను ఒట్టి స్వార్ధపరుడని వీళ్ళ ఉద్దేశం. అతనికి కొంపా గోడూ లేదు కనుక నన్ను కూడా అలాంటి స్థాయికి దించాలని చూస్తున్నాడని వీళ్ళ ఊహ.

కాకపోతే తనని వలలో వేసుకొని నా ఆస్థి దక్కించుకొనడానికి కుట్ర పన్నుతున్నాడని వీళ్ళ గోల.

చంద్రమౌళిని స్వార్ధపరుడిగా, నీచుడిగా, ధనాశా పరుడిగా చూడడం ఆమెకు అసహ్యమేసింది. ఒక మనిషిని మరో మనిషిగా ఎందుకు అర్థం చేసుకోరు? ఎందుకు సాను భూతి చూపించరు? ప్రతి విషయంలోనూ తమకు ఎంతో

అనుభవం వుందని సంకుచితంగా, వక్రంగా ఎందుకు ఆలోచిస్తారు ?

విజయ బుర్ర వేడెక్కిపోయింది.

తల నొప్పి విపరీతంగా పట్టుకుంది.

'కొంప ముంచి చంద్రమౌళిని మామయ్య ఎక్కడైనా బుర్ర పగల కొట్టిస్తే...' ఆమె గుండె దడ దడమని కొట్టు కుంది. సాయింకాలం అయ్యేసరికి వికారం పుట్టుకొచ్చింది. వాంతి అయ్యేట్లు అయింది.

ఆ రాత్రి జ్వరం వచ్చింది. భోజనం లేదు. కాఫీ త్రాగింది. డాక్టర్ వచ్చాడు. మందు బిళ్ళలు ఇచ్చాడు.

వారం రోజులు అట్లా జ్వరంతో విజయ బాధపడింది. మనిషి నీరసించి పోయింది. ఆమెను పలకరించడానికి చూడ డానికి వచ్చేజనంతో భవనం కిట కిట లాడిపోయింది.

పూరిగుడిసెలో చచ్చినా చూడరు. భవనంలో తుమ్ము పడితే 'అమ్మో ఇంకేముంది ?' అన్నట్టు బొమ్మలు బాదు కుంటారు. పది మంది సానుభూతి చూపిస్తారు. మనుషులు డబ్బుకి దాసులై పోతున్నారనేసరికి విజయకు జ్వరం హెచ్చింది.

చంద్రమౌళి వచ్చేస్తాడేమో అని విజయకు భయం పట్టుకుంది. వస్తే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో అని ఆందోళన పడింది. రాకుండా వుంటే బాగుండు ననిపించింది.

ఒకవేళ వచ్చినా దూరంగా పారిపోవాలని చెబుదామని అనుకుంది.

## 15

'ప్రజామిత్ర' పత్రికలో ఎర్రటి రంగులో ఒక పేజీకి పేజీ విజయ తల్లి పేరుతో 'కనకదుర్గా కెమికల్ ప్రొడక్ట్స్' గురించి ఒక పెద్ద ప్రకటన పడింది.

అది తీసుకొని చంద్రమౌళి వచ్చాడు.

"ఒంట్లో ఎలాగుందీ?" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"తేలిగ్గానే వుంది" అంటూ మంచం మీద లేచి కూర్చుంది.

చంద్రమౌళిని చూడడంతో సగంబలం వచ్చినట్లయింది.

"డబ్బు ఖర్చు అయిపోతోందని బెంగగావుందా?" అన్నాడు నవ్వుతూ.

విజయ చిరుకోపం ప్రకటించింది,

"మరి లేకపోతే నా బొంద ఏమిటీ ఈ నీరసం? కెమికల్ ప్రొడక్ట్స్‌కు రేపు ఆదివారమే ప్రారంభోత్సవం అని తెలుసా? రైలుస్టేషన్ దగ్గరగా ఇప్పుడు మనం షెడ్లు వేయడంతో ఎంతఅందంగా వుందో చూడండి. అదంతా ఒక చిన్న గ్రామంలావుంది. ఎంతమంది మీ గురించి చెప్పుకుంటున్నారో

మీకు తెలుసా ? అనేకమందికి ఈ రూపేణా బ్రతుకు తెరువు చూపించినందుకు మిమ్మల్ని అందరూ అభినందిస్తున్నారు...." అంటూ చంద్రమౌళి సిగరెట్టు ముట్టించాడు.

బుట్టతో బత్తాయికాయలుతీసుకొని వచ్చి పాలేరు ఆమె మంచందగ్గరగా పెట్టి వెళ్లిపోబోయాడు.

"ఇవి ఎక్కడివి ?" అంది విజయ.

"సావిత్రమ్మగారొచ్చారటండీ. మీకు ఇవ్వమన్నారట. సాయింకాలము వస్తామని మీకు చెప్పమన్నారట !" అని వెళ్లిపోయాడు.

"ఔను. చెప్పటం మర్చిపోయాను. మొగలి చెప్పాడు. మీ పుణ్యమా అంటూ వాళ్ళఇల్లు ఆనందంగా వుంది." అన్నాడు చంద్రమౌళి.

"వారి గురించి సరే. మీ గురించి ఆలోచించు కున్నారా ?" అంది విజయ.

"నా కేం ?" అన్నాడు ఆ మాటలు అర్థం కాక.

"ఆ. ఏమీ లేదు. ప్రజలు మీగురించి ఏమనుకుంటు న్నారో మీకు కొంచెం అయినా గమనించారా ?"

"ఏమనుకుంటున్నారు ?"

"మీరు బాధ పడతారు."

"ఫర్వాలేదు చెప్పండి."

"మీరు ఆ మాటలు విని ఇక్కడి నుంచి వెళ్లిపోతారు."

"నేను చాలా మొండి వాణ్ణి. ఇక చెప్పండి."

"మీరు దొంగలని. మా ఆస్తి కాజేయాలని చూస్తున్నారని, నాకు చెడ్డ మాటలు చెప్పి పాడు చేస్తున్నారని... ఇంకా ఇలాంటివే..." అంది బత్తాయి కాయ ఒలుస్తూ.

చంద్రమౌళి నిజంగా కృంగిపోయాడు. ముఖం మాడిపోయింది. ఇదంతా విజయ గ్రహించి "ఈ బత్తాయితీసుకోండి" అంది.

"వద్దండీ" అన్నాడు కాయ ప్రక్కకు పెట్టివేస్తూ.

కుర్రవాడు కాఫీ పట్టుకొచ్చాడు. చంద్రమౌళి కాఫీ కూడా తీసుకోలేదు,

"నేను అందుకే మీకు చెప్పనన్నాను. మీ గురించి అనుకొనే ప్రజలు ఎవరనుకుంటున్నారు ?"

"ఎవరైతేనేం, నేను బాధ పడడంలేదు. మనలా అందరూ చూడాలని, ఆలోచించాలని, నడవాలని అనుకొనడం లేదు. కాని విజయకుమారిగారూ...మీరు కూడా నాగురించి అటువంటి అభిప్రాయంలో లేరు కదా ?" అన్నాడు నీరసంగా.

"ఇంతకాలం నుంచి మీరు నన్ను అర్థం చేసుకోలేదా చెప్పండి" అంది విజయకుమారి బత్తాయి తొన మరొకటి తింటూ.

"అర్థం చేసుకున్నాను. ఏమిటో నా మనస్సు బాగుండలేదు." అని లేచాడు. అటూ ఇటూ ఆ హాలులో పిచ్చిగా తిరిగాడు.

"పోనీ ఈ ద్రాక్షతినండి" అంది విజయ.

"వద్దు"

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?"

"చూశారా విజయకుమారిగారూ ఈ ప్రపంచంలో మంచివాడికి ఇవి రోజులుకావు. మీ ఆస్తిమీద, మీ మీద నాకు ఎలాంటి దురుద్దేశ్యం వున్నా నేను ఏనాడో మిమ్మల్ని తలక్రిందులు చేసేవాడ్ని. అలా అనుకొనేవాళ్ళను కూడా బుట్టలో వేసుకొనేవాడ్ని. రాజకీయాల్లో తిరిగేవారిలో ఆస్తులు సంపాదించుకున్నవారున్నారు. పోగొట్టుకున్నవారున్నారు. అప్పుడూ ఇప్పుడూ ఒకమాదిరిగావున్నవారున్నారు. కాని నేను ఆఖరి తరగతికి చెందినవాడినని మీకు చెప్పనవసరం లేదేమో.

నేను నమ్మినవాళ్ళను ఎప్పుడూ ద్రోహంచేయలేదు. నాది రాచబాట. నేను ప్రజలకోసంశ్రమించాను. దేశంకోసం బ్రతుకుతున్నాను. నవభారత నిర్మాణానికి కలలుకంటున్నాను. అయినా విజయకుమారిగారూ... మీ ఇంట్లోవారికి, మీ బంధువులకు ఇక చీడపురుగులా చూడబడ్డం నాకు ఇష్టం లేదు. మన స్నేహం గొప్పది. పవిత్రమైంది. దానికి చలనం లేదు. శెలవు"అంటూ చంద్రహాళి మేడమెట్లు దిగబోయాడు.

"ఆగండి" అంటూ ఒక్కసారిగా విజయ కేకపెట్టింది.

చంద్రహాళి ఉలిక్కిపడ్డాడు. వెనక్కి చూశాడు.

"మీరు ఎక్కడికి వెళ్తున్నారు ?"

"నాకు మనశ్శాంతి వుండేచోటుకు"

"ఏం చేస్తారు ?"

"మీకు తెల్సు."

"మీరు ఎందుకు వెళ్తున్నారు ? మా ఆశా సౌధాల్ని నేలమట్టం చేసి వెళ్ళిపోతారా ? నవ భారత నిర్మాణం, నిత్యకళ్యాణం ఇట్లాగే వస్తుందా ?" అని అడిగింది.

"నాగురించి మీరు అపకీర్తి పాలు కావడం నాకు ఇష్టం లేదు." అంది తూట్లుపడిన హృదయం.

మరో అడుగు ముందుకు వేశాడు చంద్రమౌళి.

"ఆగండి, మీరు ఒక్క అడుగు ముందుకు వేశారా నేను ఈ మేడ మీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకుంటాను." అంది గంభీరంగా విజయ.

"విజయా !" చంద్రమౌళి స్తబ్ధుడై పోయాడు.

"ఔను. మిమ్మల్ని విడిచి నేను వుండలేను. నేను బ్రతకలేను. నన్ను దగా చేసి మీరు వెళ్ళకండి. వెళ్ళవద్దని మిమ్మల్ని వేడుకొంటున్నాను" అంది అతని పాదాలు పట్టుకుంటూ.

అటు ప్రక్కనుంచి వచ్చిన అమ్మమ్మ ఇటునుంచి వచ్చిన మురళి, సావిత్రి, పిల్లలూ ఆ మాటలకూ ఆ దృశ్యానికీ నిశ్చేష్టులై పోయారు.

"విజయా" అంటూ ఆమెను లేవనెత్తాడు.

"బాబూ. ఇక దాని మనస్సు దానిదే. అది చిన్నప్పటి నుంచీ అట్లా పెరిగింది. దాన్ని నీ దానిగా చేసుకో నాయనా. ఇంట్లో దాన్ని అందరూ నానా మాటలూ అంటున్నారు. పెళ్లి చేసుకుంటే కొంత శాంతి అయినా వుంటుంది" అంది అమ్మమ్మ.

"మామ్మగారూ" అన్నాడు చంద్రహాళి మరేమీ మాట్లాడలేక.

మురళి, సావిత్రి "తథాస్తు" అన్నారు.

"నేను చాలా పేదవాడ్ని. నేను అంతటి స్థానానికి తగను. బాగా ఆలోచించుకో విజయా" అన్నాడు మళ్ళీ చంద్రహాళి.

"నేను రెండు సంవత్సరాలు ఆలోచించాను. ఇక ఆలోచించవలసిన పనిలేదు" అంది విజయ. ఆమె చెక్కిళ్ళ మీాద నుంచి జారిన కన్నీటి బిందువుల్ని తన పైటి చెంగుతో సావిత్రి తుడిచింది.

దాంతో మురళి అందుకున్నాడు! "ప్రతి వారూ మీారు దంపతులు అయితే సంతోషిస్తారు. ఇది మీా కళ్యాణం మాత్రమే కాదు. మానవ కళ్యాణం. న్యాయానికీ, మంచికీ కళ్యాణం. ఉన్నవారికీ లేని వారికీ కళ్యాణం" అన్నాడు.

# 16

ఆవేళ ఆదివారం —

'కనకదుర్గా కెమికల్ ప్రోడక్ట్స్' సంస్థ ప్రారంభోత్సవ సందర్భంలో పెద్దపందెర నిర్మించారు. రంగు రంగు బల్బులతో, కాగితపు పువ్వులతో కన్నుల పండుగగా చేశారు.

ఉదయం కార్యక్రమం ప్రభాత భేరితో ప్రారంభమైంది.

చిన్నాన్న, మేనమామ, పురప్రముఖులు, అధికారులు ఉత్సవంలో పాల్గొన్నారు.

ఆ నాడు సంతర్పణ జర్గింది. పిల్లలకు పండ్లు, మిఠాయి పంచిపెట్టారు. ఆ అగరు వత్తుల కంపెనీ గురించి చెప్పుకుంటూ ఇరుగు పొరుగు గ్రామాలనుంచి కూడా జనం తండోప తండాలుగా వచ్చారు.

పదివేలమంది ఆ ఉత్సవ కార్యక్రమాల్ని తిలకించారు. ఈ సంస్థను ఎంతో ఆదర్శంగా నడపడానికి విజయకుమారిగారు పూనుకున్నారని శెట్టి ముందుగా ప్రకటించాడు.

"అంతేకాదు." అంటూ చంద్రమౌళి వేదిక మీదనున్న మైక్ దగ్గరకు రాగానే అయిదు నిమిషాలసేపు హర్షధ్వానులు మిన్నుముట్టాయ్.

"ఈ సంస్థ మీద వచ్చే లాభంలో కొంత పనివారికి, మరికొంత ప్రజల శ్రేయస్సుకోసం, గ్రామం అభివృద్ధికోసం ఖర్చుపెట్టడానికి కూడా విజయకుమారిగారు అంగీకరించారు" అని చంద్రమౌళి తన ప్రసంగంలో పేర్కొనగానే పదివేల మంది ఒక్కసారిగా 'విజయకుమారిగారు జిందాబాద్' అంటూ నినాదాలు చేశారు.

ఎన్నడూ వేదికలమీద మాట్లాడని మురళి లేచి "అంతకంటె ఆనందకరమైన విషయం ఇంకొకటివుంది" అంటూ అంతకు ముందు సిద్ధంగా వుంచిన రెండు పూలమాలలు విజయకుమారికీ, చంద్రమౌళికీ ఇచ్చి 'కానివ్వండి' అన్నాడు. క్షణం సేపు జనం, కాబోయే దంపతులు తెల్లబోయారు.

విజయ సిగ్గు పడిపోతూ కనురెప్పలు దించుకుంది. చంద్రమౌళి ఆమె మెడలో పూలమాల వేశాడు. ఆమె అతని మెడలో పుష్పమాల వేసింది.

జనం ఒక్కసారిగా ఆనందంతో నృత్యం చేశారు. ఔట్లు పేలాయ్. బాజాలు మ్రోగాయ్. పూలవర్షం కురిసింది.

# 17

ఆ రాత్రి—

జీవితంలో మొదటి సారిగా—

చంద్రమౌళి ఏకాంతంగా కూర్చున్న శోభనపు గదిలో విజయ ప్రవేశించలేక ప్రవేశించింది.

సిగ్గు దొంతరలు ఆమెకు గిలిగింతలు పెట్టాయ్, చంద్రమౌళి ముసిముసి నవ్వులకు ఆమె శరీరం పులకరించింది.

గది నిండా సువాసనలు.

మనసుల నిండా మల్లెపూల మాలలు.

హృదయాలలో ఆనంద తరంగాలు.

మౌనంలో కొన్ని క్షణాలు.

సుగంధ ద్రవ్యాల సంస్థ ప్రారంభోత్సవం పెండ్లికి దారి తీయడం ఎన్నడూ ఊహించని సంఘటన అవడంవల్ల వారు ఆ సన్ని వేశాన్ని తల్చుకొని ఆనందంలో ఉక్కిరిబిక్కిరి అయిపోయారు.

"విజయా ..." ఆమె ఎత్తైన వక్షస్థలం మూస్తూ పిల్చాడు.

"..............."

"విజయా..." సిగరెట్టు ముట్టిస్తూ మళ్ళీపిల్చాడు.

విజయ తన మృదువైన హస్తాలతో ముఖంకప్పుకుంది.

"ఇలా చూడండి"

"ఇక చూడండి. అనకండి" అంది విజయ ముఖం ఎత్తకుండానే.

"ఏమనాలి ?"

"నాకు తెలియదు" అంది మనసిచ్చిన వయస్సులో వున్న పిల్ల.

చంద్రమౌళి ఆమెను కౌగిటలోకి ఆహ్వానిస్తూ చేతులు చాచాడు. విజయ పాదరసంలా కదలిపోయింది.

ఎదురుగావున్న ద్రాక్షపళ్ళు గుసగుసలాడాయ్. ప్రక్కనున్న నిలువుటద్దం ఆ నూతన దంపతుల్ని తమాషాగా చూసింది.

"నువ్వు నాకిచ్చిన ఈ ఉన్నత స్థానాన్ని నేను నిలబెట్టుకోగలనంటావా విజయా ?"

"..............."

"నువ్వు తొందరపడి ఈ నిర్ణయానికి వచ్చావేమో అనిపిస్తోంది..."

"..........."

"నువ్వు భాగ్యవంతుల బిడ్డవు. నేనో సామాన్య వ్యక్తిని"

విజయ తన చేతిని అతని నోటికి అడ్డుగా పెట్టింది.

ఆ అరచేతిని ముద్దు పెట్టుకున్నాడు. ఆమెలో ఒక విధమైన విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. తన హస్తాన్ని వెనక్కి తీసుకుంది.

అల్మారో వున్న తాళం చేతులు చంద్రమౌళి చేతికి యిస్తూ "నేను సామాన్యవ్యక్తిని, నేను సామాన్య వ్యక్తిని అని ఇక దయవుంచి అనకండి. మీకు డబ్బు వుంటే అసలు ఇలా రాజకీయ రంగంలో ప్రవేశించి వుండేవారు కాదేమో. ప్రవేశించినా నా హృదయంలో ప్రవేశించే స్థానం మీరు పొంది వుండేవారు కాదేమో..." అంది విజయ.

"విజయా. ఈ తాళం చేతుల కోసం నీ బ్యాంకు బుక్కుకోసం నేను నిన్ను పెళ్ళి చేసుకోలేదు..." అన్నాడు తాళంచేతులు దూరంగా విసరివేస్తూ.

"మరి దేనికి?" అంది సింగారి.

"ఇట్లా రా. చెబుతాను" అన్నాడు చంద్రమౌళి ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

విజయ కిల కిల మని నవ్వింది.

ఆ ప్రశాంత ఏకాంత వాతావరణానికి హృదయాలు మంచులా కరిగి పోయాయ్.

మనోజ్ఞమైన ఆ సన్నివేశం ఇరువురికీ మత్తెక్కించింది. విజయలోని యౌవ్వనపు పొంగు, వలపును వొలికించే ఆ ఎర్రటి పెదవులూ జాతీయ అంతర్జాతీయ రాజకీయాలతో వేడెక్కిపోయిన బుర్రను మరోలోకం లోకి తీసుకొని పోయే

వెచ్చని కౌగిలింత, ఎన్నడూ ఊహించని తియ్యటి ముద్దులూ అందుకోని ఆనంద సీమల్లో విహరించమని చంద్రమౌళిని తొందరపెట్టి పారేశాయ్.

"విజయా..." అంటూ ఆమెను తన వొడిలోకి తీసుకోన బోగానే "ఆగండి. ముందు నా కోరిక తీరుస్తానని మాట ఇవ్వండి" అంది.

"ఏమిటి?"

"ఒక నెలరోజులపాటు దేశమంతా తిర్గివద్దాం. ముఖ్యంగా నాల్గురోజులు కాశ్మీరు సుందర దృశ్యాలు చూసి వద్దాం. వెళ్దామంటారా?" అంది.

"ఓస్ ఇంతేనా? అయినా కాశ్మీర్ ఎక్కడో వుందనుకుంటున్నావా? మన మనస్సుల్లో, మన చూపుల్లో వుంది" అంటూ చంద్రమౌళి కాల్చే సిగరెట్టు కిటికీలోంచి గిరాటు వేసి, నెమ్మదిగా బెడ్‌రూమ్ లైట్ కూడా ఆర్పివేశాడు.

# 18

సుమారు రెండు నెలలపాటు భారతదేశంలోని ముఖ్య నగరాలన్నీ చూసి, చంద్రమౌళి, విజయకుమారి స్వగ్రామం చేరుకున్నారు.

రావడంతో మొదటిసారిగా మురళి ఒకవార్త పట్టుకొచ్చాడు. 'ప్రజామిత్ర' దినపత్రికకు మొదటి సంవత్సరం 8 వేల రూపాయలు లాభం వచ్చిందని సగర్వంగా చెప్పాడు.

అందరూ ఎంతో సంతోషించారు.

ఆనాడు 'ప్రజామిత్ర' కార్యాలయంలో జరిగిన తేనీటి విందు అనంతరం పత్రికలో పనిచేసే సిబ్బందికి, విలేకరులకు ఒక సంవత్సరం జీతం బోనసుగా ఇవ్వమని విజయకుమారి ఉత్తర్వులు జారీచేసింది.

మిగిలిన డబ్బుకు కట్టింపు డబ్బువేసి పనివారలకు, సంపాదక వర్గానికి 'క్వార్టర్స్' కడదామని చంద్రమౌళి అన్నాడు. అందరూ ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బు అయి పోయారు.

నిజంగా డబ్బు లేనప్పుడు ఎన్ని అయినా కోరికలు వుంటాయ్. ఏవేవో ఊహించడం కద్దు. తీరా లక్షలకు సర్వాధికారి అయినప్పుడు లోగడ చెప్పిన మాటలు, చూపిన ఆదర్శాలు గాలిలో కలిసిపోవడం సాధారణంగా జరిగే విషయాలు.

అయితే చంద్రమౌళి గురించి ఎప్పుడూ అనుమానించే విజయకుమారి మేనమామ, చిన్నాన్న, అత్తయ్య పిన్ని మొదలైన బంధువర్గం అతని చిత్తశుద్ధిని శంకించడం మానివేశారు. కాని ఉన్న ఆస్థిని తగులబెట్టి వేస్తున్నాడని, మథన పడ్డారు.

అప్పుడూ ఇప్పుడూ చంద్రమౌళి దృక్పథం ఒక్కటే అనిపించాడు.

'విజయా, నువ్వు సిగ్గుపడేటట్లు, నువ్వు అవమానించ

బడేటట్లు నేను జీవితంలో ఎన్నడూ చేయనులే. నీకు కష్టం కల్గించే చిన్నమాటకూడా నేను అనను సుమా' అని ఒకసారి అన్నప్పుడు విజయ 'ఛా. ఏం మాటలండీ అవి' అంది.

ఇంతకూ ఆయనకు తీరుబడి లేకపోవడం ఒక విధంగా కొంత అసంతృప్తి కల్గించినా, భర్త చేసే పనులు ఒక కంటితో కనిపెట్టసాగింది. అతనుగురించి ఆనోటాఆనోటావిన్నప్పుడు గర్వపడింది.

నిజంగా చంద్రమౌళి ప్రతివ్యక్తికీ చేయూత ఇచ్చాడు. ప్రతి సంస్థ ముందుకు సాగిపోయేటట్లు పూనుకున్నాడు. చివరకు అగరువత్తుల కంపెనీలో వచ్చిన లాభాలను అనేక ధర్మకార్యాలకు వినియోగించాడు. వ్యవసాయ రంగంలోకూడా విప్లవాత్మకమైన మార్పులు ప్రవేశ పెట్టాడు.

అట్లా లక్షలాది రూపాయలు ఖర్చుచేసి ఒక సుందరమైన ఆదర్శప్రాయమైన ప్రాంతంగా మార్చివేశాడు.

ఆ ప్రాంతంలో స్వార్థం, అనుమానం, అసూయ అనే విషక్రిములు లేకుండా చేశాడు.

ఆ మరో ప్రపంచంలో చిరునవ్వు, సంతృప్తి, సహకారం తప్ప మరొకటి మచ్చుకైనాకన్పించకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు.

భారత దేశంలో ఆదర్శప్రాయమైన ఆ ప్రాంతాన్ని చూడడానికి తరలివచ్చే యాత్రికులకు ప్రభుత్వం అనేక సౌకర్యాలు ఏర్పాటు చేయవలసి వచ్చింది.

జట్లు జట్లుగా అనేక రాష్ట్రాలనుంచి, విదేశాలనుంచి అనేకమంది అక్కడకువచ్చి ఆనందాశ్చర్యాలు ప్రకటించారు. మనసారా మెచ్చుకున్నారు.

చంద్రమౌళి దంపతులు సాధించిన విజయాలు గురించి, అందుకు వారు తీసుకున్న చర్యల గురించి నివేదికలు పంపమని ప్రభుత్వం ప్రత్యేక కమిటీలను నియమించింది.

ఆ ప్రజలు ఎప్పుడు చెప్పినా, ఎక్కడ చెప్పినా ఒక్కటే మాట :

"మేము చాలా హాయిగా వున్నాం"

# 19

రెండు సంవత్సరాలనంతరం —

విజయ దంపతులకు పుత్రోదయమైంది.

బారసాలకు ఊరంతా తోరణాలతో ప్రజలు వీధుల్ని అలంకరించారు. గృహాలకు రంగులు వేసుకున్నారు. గుమ్మాల ముందు ముగ్గులు పెట్టుకున్నారు.

ఆనాడు వేలాది మందికి పంచభక్ష్యపరమాన్నాలతో భోజనాలు ఏర్పాటు చేశారు.

బాణా సంచాతో దీపావళిని మరిపించి, మురిపించేలా వేడుకలు జరుపుకున్నారు.

ఎర్రగా, బొద్దుగా వున్న బాబుని చూసి "అంతా వాళ్ళ తాతయ్య పోలికే" అన్నారు.

"నీ ఆస్థి అంతా అయిపోయింది విజయా. ఏం చూసుకొని అట్లా మురిసి పోతున్నావ్ ?" అన్నాడు చంద్రమౌళి నవ్వుతూ.

"ఇదుగో. నా ఆస్థి, నా నాన్న, నా చిట్టినాన్న. కొన్ని లక్షలరూపాయలు విలువచేసే నా బంగారు తండ్రి" అంటూ విజయ పిల్లవాడ్ని ముద్దుల వర్షంతో ముంచెత్తివేసింది.

(అయిపోయింది)







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B159 |
| పుస్తకం పేరు | పయనమైంది ప్రజారథం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1 to 4 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |